# పద్మనాభయుద్ధం

ఆంధ్రభారతీ తీర్థ [illegible]

బుర్రా శేషగిరిరావు

యం. ఏ. పి. హెచ్. డీ.

గారిచే

సంపాదితము

ఆంధ్రక్షత్రియ గ్రంథమాల ! ప్రథమకుసుమము.

# పద్మనాభ యుద్ధము.



(ప్రాచీన ఏకాశ్వాస ప్రబంధము)

ఇది

చట్రాతి లక్ష్మీనరసకవి ప్రణీతము.



ప్రకాశకులు.

శ్రీవత్సవాయి రాయజగపతివర్మగారు

ప్రొప్రయిటరు.

శ్రీజగపతి ముద్రణాలయమున వారిచే రాజమండ్రిలో

ముద్రింపఁబడి ప్రకటింపబడినది.

1927

 [వెల 0-12-0

# విజ్ఞప్తి.

—:o:—

ఆంధ్రశాస్త్రములకు సంబంధించిన ప్రాచీనగ్రంథము లను క్రమముగ ముద్రింపబూనుకొనినారము. అవసరముతెం బడిన నవీన గ్రంథములుకూడ ముద్రింపబడుచుండును. మా ఆంధ్రరాష్ట్రపత్రిక చందాదారుల కందరకును యీగ్రంథ ములు తక్కువధరకు యీయబడుచుండును. ప్రతిగ్రంథ విద్యార్థికుల పీఠికతో నలరారుచుండును. మా గ్రంథముల కు శాశ్వతచందాదారులు కాదలచినవారు అర్ధరూపాయిప్ర వేశ రుసుము పంపునెడల మా ఆంధ్రరాష్ట్ర పత్రిక చందా దారులు కాకపోయినను తక్కువధరలకు గ్రంథములను సం పాదించగలరు.

ఈగ్రంథమునందు స్ఖాలిత్యములు చాల గాన్పించు చున్నవి. ఇదివఱకెవ్వరును ప్రకటింపక పోవుటవలన ఏదోరీతిని గ్రంథము ముద్రణమైనయెడల ద్వితీయ ముద్రణమున సవ రింప వచ్చునని ప్రకటించితిమి. త్వరలో ద్వితీయ ముద్రణము వేయుటకు ఆంధ్రసోదరులు తోడ్పడెదరుగాక!

గ్రంథ ప్రకాశకులు.

# అవతారిక

సీ. ఏరాజు బాహ్వసి వారిపూరంబులు
సతతంబు దెప్పించి స్నానమాడె
ఏరాజు నిత్యంబు శ్రీరంగనాథుని
చరణారవిందముల్ సన్నుతించె
ఏరాజు విప్రుల కిష్టసాలగ్రామ
దానముల్ బహుకోట్లు ధర్మరతిని
ఏరాజు సకలవిద్యారహస్య ప్రవీ
ణత్వంబుచే జగన్మాన్యుడయ్యె
పూసపాటి కులాంభోధి పూర్ణచంద్రు
డైన విజయరాము వసుంధరాధిపునికి
తగినగార.... హంససంభవులు గనుక(?)
ఇతరనృపతులకిచర్యలె పటగలవె.

భట్టుచాటువు.

ఈచాటుపద్యమునందు ప్రశంసింపబడిన శ్రీవిజయరామగజపతి మహారాజు వారి వీరవ్యాపార మీ పద్మనాభ యుద్ధ, మను కావ్యమున వర్ణింపబడియున్నది. గనుక నీగ్రంథము నారాయణకవి రంగారాయచరిత్రము వంటివీరరస ప్రధానమగు కావ్యము. ఈగ్రంథమందొక్క యాశ్వాసము మాత్రమే ఆంధ్రభారతీతీర్థ పరిశోధక విశ్వవిద్యాలయము

రామరాజ మహారాజవారి వలన ప్రజలకు కలుగుచుండిన బాధలను వర్ణించుచు. గాన నీకృతికర్తయు కృతినాయకులు సమకాలీనులనియూ తెలుచున్నది.

దానికిన యీయాశ్వాసమందు పద్మనాభ క్షేత్రమున శ్రీవిజయరామ గజపతి కళింగాధీశ్వరులకును ఇంగిలీషు కంఫిణీ వారికిని జరిగినయుద్ధయు సకారణముగాను సమగ్రముగాను వర్ణింపబడియుండుటచేతను శ్రీవిజయరామ గజపతి మహారాజులుంగారి జీవితచరిత్రములో నీయొక్క భాగమే వర్ణింపబడియుండుటచేతను దీనికి పద్మనాభయుద్ధమని పేరిడి ప్రచురింపడ మైనది.

కృతిపతి శ్రీపూసపాటి నారాయణగజపతి మహారాజులుంగారు వీరు శ్రీపద్మనాభ క్షేత్రమందు వీరస్వర్గమునకు వేంచేసిన మహారాజుల పుత్రవర్యులు. ఈయంశమాశ్వాసారంభ పద్యమునను ఆకరువాత నెం 19. 294, 295 రు పద్యములవల్ల తెలియుచున్నది. శ్రీపూసపాటివారి కళింగసామ్రాజ్యమును ఇంగిలీషు కుంఫిణీవారు విడగొట్టి జమీందారీహోదాకు దించివేయుట యీనారాయణ గజపతి మహారాజులుంగారి హయాములోనే జరిగినది. యుద్ధానంతరము వీరికి రాజ్యమొప్పచెప్పక గెలిచిన రాజ్యభాగముగా నాటికుంఫిణీ వారులు పాలింపజూచిరిగాని యది సాగక తుదకు వీరిరాజ్యము వీరికే దఖలుపరచిరి. శ్రీవిజయరామ గజపతి కళింగాధీ

క్ష్వరుల తొడల నధికారములు జొపించిన యపచారమునకు వగచి కాపోలు అప్పుడు గవర్నరుగానుండిన రంబోల్డుదొర వారిని బ్రిటిషుపార్లమెంటులో విచారణచేసి పదచ్యుతిని చేసె. అప్పుడు పార్లమెంటులో ప్రవేశపెట్టబడిన తీర్మానమిట్లున్నది.

That the Governor and majority of the Council, Fort st, George did by menaces and karsh treatment, co-mpel Vijiaramaraj, the Raja of Vijianagaram to employ Sitaramaraj as Dewan in the room of Jaggannath, a man of probity and good character; that the compulsive menaces made use of towards the Rajah and the gross ill- treatment which he received at the Presideney, were humiliating, unjust and cruel in themselves, and highly derogatory to the interests of the East India Company and to the honour of the British nation (Charmichael's Manual p 197)

ఈయంశమును విశాఖపట్నంజిల్లా మాన్యుయల్లో రికార్డుచేసిన కార్మైకేల్ దొరవారు పద్మనాభయుద్ధమును గురించి వ్రాయుచు ఆత్మగౌరవము నిలువబెట్టుకొనుటకు శ్రీ విజయరామ గజపతివారు(రణరంగమున) ప్రాణత్యాగముచే యవలసివచ్చెనని యొప్పుకొనిరి.(„It was necessary for him to yield up his life to save his honour")దీనినే Gribble గ్రిబిల్ అను చరిత్రకారుడు „దక్కను„ అను చ్రిమాలిక గ్రంథము వ్రాసినయాతడు„మరచిపోబడిన యొడంబడిక„ (A Forgotten Treaty)యను పత్రికయందిట్లు ప్రకటించియున్నాడు —

"The treatment which the Rajah received.........last century left at the time a sore feeling.........of his family and eventually led to.........of 1794.........which forms a signal........of how a Rajaput Prince whose honour has... been tarnished, feels that the only resort......to die" J. D. B. Gribble.

(ఇంగ్లీషులో లోపించిన భాగములు ఆంధ్ర భారతీతీర్థమునకు శ్రీయుత K. L. Narasinga Raoగారిచ్చిన యుత్తరప్రతిలో చినిగిపోయి యున్నవి)

ఇట్టి నిర్వచనములకు బొబ్బిలి యాపన్నాశ యుద్ధము విషయములో విజయనగర సామ్రాజ్యాధీశ్వరులకు ఇంగ్లీషుకంపెని యధికారులవల్ల నానాటికి దురంతమగు నన్యాయము జరిగినట్లప్పటి పార్లమెంటువారికేగాక పందొమ్మిదవ శతాబ్దమునందలి ప్రామాణికులగు Gribble (గ్రిబిలు) వంటి యాంగ్లచారిత్రికులకుగూడ తోచియుండుట స్పష్టమైయుండగా శ్రీవిజయనగరాధీశ్వరులకును, వారి యాస్థానకవులకును నప్పుడట్లు తోచుటలో నాశ్చర్యములేదు. గనుక నీగ్రంథమందలి నెం॥ 81, 136, 138 పద్యములు చారిత్రికముగ సమర్థనీయములై యగుచున్నవి. గనుక నీకావ్యము చారిత్రిక కావ్యములలో పరిగణింపదగినదై శ్రీకృష్ణరాయవిజయము, పల్నాటివీరచరిత్ర, రంగారాయచరిత్ర, నరపతివిజయమువలె చారిత్రికముగకూడ ప్రామాణ్యము జెందుచున్నది.

ఈ యుద్ధమునకు కారణమీ కావ్యమున నెం॥ 42రు నారువ

దస్తావేజులలో నొకవిధముగను సం ౧౭౬౮ రు దస్తావేజులలో నొక విధముగను చెప్పబడి యున్నను నీరెండు కారణములను పర స్పరము సమన్వయపడుచున్నవి. కుంఫిణీ వారి యుద్దేశముల నూహించుచు శ్రీవిజయరామ గజపతివారు ఉత్తరువు వంచన సేయవలెను మాత్రమే కోరిరి,, యనుచు దస్తావేజులోనున్న రీతిని నిశ్చయించి వగచినట్లు కలదు. ఇదియెంతమాత్రమును అతిశయో క్తి కానేరదని రుజువుచేయగల యితర రికార్డు దాఖలాలిందు బొందుపరచుచున్నాము.

(౧) శ్రీఆనందగజపతిరాజుగారితో ఇంగిలీషు కుంఫి ణీవారు చేసుకొన్నయొడంబడిక(Treaty) ననుభవపరచియుత్తరా లింగి సరకారులను నిజాముగారివద్ద కౌలుకు పుచ్చుకున్న ట్లావ రిమిలాను వ్రాయించుకొన్న యొడంబడికనే ప్రాముఖ్యమున కు తెచ్చుట యాకాలమున ఇంగిలీషుకుంఫిణీ అధికారుల రా జ్యకాంక్ష విధానమున కెట్లు ప్రకాశించి యుండెనో(Gribble) గ్రిబి లు పండితులిట్లు వర్ణించియున్నారు—

In 1768 the condition of affairs in the Deccan was very different to what it had been ten years previously. In 1768 we have not yet grasped Dupleix's briillant idea of an Indian Empire. All that we then wanted were the sea ports as outlets for our trade, with small surrounding districts for their upkeep. - Now things are dsiferent; the French had been driven out of the Country; the Carnatic was virtually governed by the Company and an Anglo-

Indian Empire seemed to be a possi bility. In order to carry out the india, the acquisition of the circars had be-come a necessity; and so it became a matter of policy to ignore the Treaty we had made with the Rajah; we assumed the place of his suzerein and even 'took under our actual managemnt the districts while he had previously rented at an almost nominal rent. All that were left to him were the ancestral estates which formed a portion of the British district of Vizagapatam'

ఈవర్ణనములోగల వంచనవిధానమీాకృతి నాయకుడగు శ్రీవిజయ రామగజపతి రాజులవారి కాలమున ప్రారంభమై వారి నిర్యాణముతో పూర్తియైనది.

(౨) కొండూరుకోట పరాసువారిని కొట్టి ఇంగ్లీషుకుంఫిణీవారితో ఒడంబడికచేసిన శ్రీఆనందగజపతి వారెంతస్వతంత్రముగా వ్యవహరించినదియు వారి యధికారము 1758 సం॥ ప్రాంతమున ఉత్తరతెలంగి సర్కారులలో నట్లు చెల్లుచున్నదియూ తెలుపగల రికార్డుభాగ మిాక్రింద నుదాహరించడమయినది. ఇట్టి యధికారమే తదనంతరము పూసపాటివారి సంస్థానమునకు చెల్లివచ్చినయెడల నింగ్లీషుకుంపిణీవారి రాజ్యతంత్రమునకెంత యననుకూలమో దీనివల్లనే స్పష్టమగుచున్నది. ఈయుద్ధృత భాగములగల రికార్డులో నీసామ్రాజ్యమును విడగొట్టుమార్గము లప్పటి యధికారులకు సూచింపబడియున్నవి:—

"when the English first got footing in them in consequence of the taking of Machilipatam, by Col Forde in 1759 (Lord Clive was invited to this measu e by a letter from Anunda Rauze) Anunda Rauze was the most considerable zamindar in the Chicacole Circa and the whole five circars were in a great measure under his management for the French, the Soubah or himself according to circumstances,, Extract from Cotsford's Letter to the Court of Dircetors in January 1777.

దీనినిబట్టి ఆనందగజపతివారి యనుమతముచే నింగ్లీషు కుంఫిణీవారీ రాజ్యములలో కాలుబెట్టిరని చెప్పబడినమాట యతిశయోక్తి కానేరదు.

(3) ఇంతకును కృతినాయకులగు శ్రీవిజయరామగజపతివారింగ్లీషు కుంఫిణీవారికిని తమకును గోలకొండ నిజాంవారధికారులని తెలిపించినట్లును, ఆయూహాతో నే వ్యవహరించినట్లును ఈకావ్యమందుగలదు. ఈయభిప్రాయము సమర్థనము కూడా రికార్డుదాఖలాలవల్ల కనబడుచున్నది. శ్రీఆనందగజపతిరాజులవారి నిర్యాణానంతరము, రాజమహేంద్రవరములోనే కృతినాయకులు నిజాంవారివల్ల విజయనగరం సంస్థానమునకు పట్టాభిషేకము చేయబడినట్లు నిదర్శన మిట్లున్నది —

"In Fasali 1169, Ananda Gajapaty Raju joined Col-Forde and wrested Machili Bandar and other places from the French and on his way to his place died at Rajamahendravaram. As he had then no children Vijayaramaraju's wife Chandramma got a boy aged 12 years named Venkatapathiraju, a kinsman of her

husband, installed him and obtained Rajaghery Siriphave from Nizam Alli Khan and got him the title of- after her husband's name—Vijayarama Raju"

Exhibit XXXVI Appeal No. 144 of 10/09
(Defendant's Documents)

ఈయంశమే బారాబత్తీ కైఫీయతులో నిట్లు చెప్పబ
డి యున్నది—॥అంతట గోలకొండనుంచి నవాబు మీరుని
జామల్లీఖాను వారు వచ్చి రాజమహేంద్రవరం ఆవల కొ
వ్వూరువద్దను గౌతమీ మహానదీ తీరమందు దిగియుండగా,
పూసపాటి సమస్థానములో ముఖ్యఆలోచనకర్తలు అయ్యిన
పిన్నపెద్దమనుష్యులు బుర్రా బుచ్చన్న: బుర్రా వెంకన్న,
(హూవంశీయులు॥ సం॥ హా॥) గుండాల అప్పాజీరావున్ను ఆలో
చనచేసి పెద్దాపురములో వున్న పూసపాటి రామభద్రరాజు
గారి రెండో భార్యకుమారుడు అయ్యిన విజయరామరాజున్ను
వెంటబెట్టుకొని వచ్చి యీయున ఆనంద గజపతిగారి తమ్ముడు
అనితీసుకొని వెళ్ళి మీరునిజామల్లీ ఖానువారికి అగపరచగా
ఆయనకు ఆచిన్నవానికేసుంచి చాలా అనుగ్రహించవచ్చి ఆచి
న్నవాడికి పూసపాటివారి సమస్థానం పట్టంకట్టి శిరపావు
మొదలైన బహుమానములు యిచ్చి నిజామల్లీఖానుడు గోల
కొండకు లేచిపోయెను..

Mackenzie Mss vol IV pp 544-45.

(౮) ఇంగ్లీషు కుంఫిణీ అధికారుల కావటిద గజపతిరా
జవారి నిర్యాణానంతరము శ్రీ పూసపాటి వారియెడల వంచ

నబుద్ధి జనించినట్లు (Gribble) గ్రిబిలుగారుచూపిన మరియొక నిదర్శనము:—

కుంఫిణీవారు 1765 సం॥ ఢిల్లీపాదుషావారివల్ల ఉత్తర సర్కారులు యినాంజాగీరుగా పొందినట్లు చరిత్రలలో వ్రాయుదురుగాని అదిగోలకొండ నిజాంవారు మన్నించరను భయముచేతను, శ్రీనిజాంవారు 1766 సం॥ లో యుద్ధసన్నద్ధులగుచుండుట బట్టియు, కుంఫిణీవారీసర్కారులను రామానందగజపతివారితో చేసుకొన్న యొడంబడికకు విరుద్ధముగా తిరిగీ నిజాంవారివల్ల కౌలుకుపుచ్చుకొన్నట్లు 1766 సం లో ఒడంబడిక వ్రాసుకొన్నారు ఈయొడంబడికయే కుంఫిణీవారు శ్రీనిజాంవారితో చేసుకొన్న మొట్టమొదటి యొడంబడిక. దీనివల్ల తేలుచున్న యంశములు రెండు. ఇందులో ఇంతకుముందు ఢిల్లీపాదుషావారివల్ల ఈరాజ్యములను గురించి కుంఫిణీవారు పొందిన ఫర్మానా విమయముగాని, విజయనగరంరాజాగారి స్మరంశిగాని లేవు. నిజాంవారికి వీరివల్ల చెల్లవలసిన క్షేమక్షుకూడా యెక్కువగా నుబాహారింపబడినది. అది 1759 సం॥ ఒడంబడిక ప్రకారము నిజాంవారికి విజయనగరంవారివల్ల చెలావణీ ఆయిన పంజుకముకన్న చాలాయెక్కువగానుండి తమపూర్వ మిత్రులయిన విజయనగరంవారి స్వాధీనములోనున్న రాజ్యములకు వారిచ్చుచునచ్చిన కప్పముకన్న నెక్కువయివ్వవలిసి యని కుంఫిణీవారు ఊహించనలదినట్లు

చూ తురున్నది. గ్రిబిలువారి వాక్యములిట్లున్నవి :—

"Two things are noticeable in this Treaty. No mention is made of the friman obtained from the Emperor and no mention is made of the Rajah of Vizianagaram The amount of tribute to be paid is also very high, and would seem to be much more considerable than the Nizam had previously obtained from the Rajah under the terms of the Treaty of 1759 and it would therefore have the appearance that we were attempting to outbid an old ally in order to obtain a grant of the districts in his possession the holding of which we had guaranteed to him in a treaty of 1758"

దీనిఁబట్టి శ్రీ ఆనంద గజపతిరాజావారి నిర్యాణము నాటినుండియు నింగిలీషు కుంఫిణీవారప్పటి విజయనగర సామ్రాజ్యాధీశ్వరుల యెడల వంచనయే తలచినట్లాంగ్లచరిత్రకారులకే పొడకట్టినట్లు స్పష్టమగుచున్నది.

ఇక నిట్టివారియెడల [illegible] సీకృతి నాయకులగు శ్రీ విజయరామ గజపతి కళింగాధీశ్వరులు వ్యవహరించిరో గమనింప తగ్గది:—

(౧) 1766 సం॥ లో నిజాంవారికిని ఇంగ్లీషుకంపిణీ వారికిని ఒడంబడికలు జరిగినతరువాత నాళ్ళకు నిజాంవారికి వీరిపయిని కోపము వచ్చి శ్రీవిజయరామ గజపతి కళింగాధీశ్వరులకు కళింగ సర్కారులను ఫర్మానా వ్రాసిపంపి కుంఫిణీవారిని కొట్టి తగిలివేయునటుగా శ్రీనిజాంవారి ఫర్మానాలు వారికిపంపివేసి కుంఫిణీవారి స్నేహము చేసి విజయనగరము

వారు పాటించినట్లు శ్రీవిజయరామ గజపతివారున్ను శ్రీసీతారామరాజువారున్ను ప్రత్యేకప్రత్యేకముగా చెన్నపురికుంఫిణీదొరలకు వ్రాసిన జాబికలు రికార్డుకాబడియున్నవి. ఇట్టిను హాసవాలుని క్షేమక్రమము బాకీ పడీసందు కగౌరవపరచి రాజ్యమునుండి తొలగిపోవలసి వచ్చినట్లాజ్ఞయిచ్చి కుంఫిణీ అధికారులు యుద్ధమునకు రెప్పెట్టిరికాని ఆఖరుకు పద్మనాభమందు యుద్ధ సమయమునకూడా కుంఫిణీవారి పటాలములపయిని తమతరఫు న గుండు ముందుపేలగూడదని సేనలకుత్తరువిచ్చియుండినట్లు ,,ఉ,,కూడదు కుంఫిణీమోనను ,,అను నెం 205 రు పద్యమందు కనబడుచున్నది. ఈయంశము యదార్థమును నిరూపరచువాక్యములు లా యుద్ధపు రికార్డులలో నున్నవి ,,

(1) Extract from Report of Lieut Col Pendergast Camp near Padmanablium 11 th July 1794.

"During the time I was forming my l ne, a horseman from the Rajah came and desired to know what business I had there. I desired him to the Rajah that I referred him to the letter which I had sent him two days before to this he replied that if my people fired, the Rajah's people were ready to fire also."

(2) Extract of consultation dated 14 th July 1794.

"It is also reported that the Rajah said when this Colonel was approaching that he intended to secrifice his life only, and desired Vijiagopal Rauze and others were with him to return to their houses and not to fight with the Company"

(3) Extract of Intelligence, Padmanabham 18 thMay.

"It is said in the camp that they will proceed to fight"

"Some people of consequence are taking that on account of the friendship between the Company and the Rajah from long time, he will not take up arms against them.,,

ఈయంశములను నుద్ఘాటించుచు "పూనపాటివారి పూర్వోత్తరము" అను లోకలు రికార్డులో నిట్లున్నది:—

"కాబట్టి మనము త్వరపడితే కుంఫిణీవారిమీద ముందర మన చెయ్యి మించింది అన్న పేరుమాత్రం మనకువస్తుంది యిందుకు నేహో ముందర నడుస్తూ గుండుమాత్రం కాల్చకుండా ఫిరంగులకు లావుచేసితే ఆ॥ మన కర్నాటకము యొక్క పరాక్రమము అన్కారకు వస్తుంది అని ఆక్షేపు చేస్తూండగా.... .... .... ....,,

ఇంతమాత్రముచేత నీయనకు యుద్ధప్రీతియు తెలియక భయపడి యిట్లు చేసిరని యూహింపగూడదు. ఏలయన 1791 సం॥ మెయి తే 20 దీ పద్మనాభమునుండి కుంఫిణీవారికి వెళ్ళిన భోగట్టావల్ల నాతోలినాడు సాయంకాలము శ్రీవిజయరామరాజు వారు ఫిరంగులున్న చోటికి వెళ్ళి మూడుఫిరంగులు పేల్పించి చూచి, యుద్ధమందు ప్రయోగ చేయు విధానమును గురించి ప్రసంగించినట్లు తెలుపబడినది. ఎట్లనగా:—

Extract. Intelligence Padmanabham 20 th May midnight

"The Rajah went yesterday in the evening where the guns are and ordered 3 guns to be fired. He talked about the manner of firing in battle."

ఈనిదర్శనములనుబట్టి వీరు స్వేచ్ఛముగా యుద్ధముచేయనే లేదని స్థిరపడుచున్నది. అయినను ఈకావ్యకర్త మాత్రము వీరు తీవ్రముగా యుద్ధముచేసినట్లు వర్ణింపబడుటచూడ నది కవిలోక సామాన్యమగు రచన యని చెప్పకతప్పదు. వీరవ్యాపారము నెరపునట్లు నిట్టికర్మబుద్ధిగల యీమహాశక్తులు తపశ్శాలురనియు సంకీర్తనసక్తులనియు పరమ భాగవతోత్తములనియు పరమపావనులనియు నీగ్రంథములోని వర్ణనవల్లనే గాక గ్రంథాంతరములందుగూడ గానవచ్చుచున్నది. ఇట్టిపరమధర్మపరులయొక్క వంచనబుద్ధి నాటియధికారుల కేలకల్గెనో సమర్థనీయముగాదు. రాజ్యతంత్రమున ధర్మాధర్మబుద్ధి కుంఫిణీయధికారులంతగా పాటించలేదనియే యనవలసివచ్చును.

నాటియుద్ధములో సీసత్రిభువు మోత్రిల వీరవ్యాపారము నెరపి ప్రాణములర్పించిన యాంధ్రక్షత్రియ వీరులలో నీకావ్యమందు శ్రీపూసపాటి విజయగోపాలరాజు, శ్రీచాగి గోపాలనరసరాజు, శ్రీదాట్ల వేంకటపతిరాజు, శ్రీదాట్ల అప్పలరాజు, శ్రీవత్సవాయి నరసరాజు, శ్రీజంపని అప్పలరాజు విజయరామరాజుగార్లుగాక క్షత్రియేతర వీరులగు హసనుబేగు హేలురాజు మొదలగువారు బేర్కొనబడిరి. ఈగ్రంథమందు హస్సనుబేగు చేసిన యుద్ధము బాగా వర్ణింపబడియున్నది.

పూసపాటివారి పూర్వోత్తరములను రికార్డులలో హాలుబాజా వీర వ్యాపారములు వర్ణింపబడియున్నవి యుద్ధము మాత్రము ఘోరముగా జరిగినదని గవర్నమెంటు రికార్డులను అంగీకరించుచున్నవి. శ్రీవిజయరామరాజు కళింగాధీశ్వరులతో యుద్ధభూమిని సహగమనమైనవారి నామాంకితము లప్పటి రిపోర్టులలో నిట్లున్నవి—

శ్రీయుతులు పూసపాటి విజయగోపాలరాజుగారు, దాట్ల అప్పలరాజుగారు, భూపతిరాజు పద్మనాభరాజుగారు, జంపన అప్పలరాజుగారు, చింతలపాటి నీలాద్రిరాజుగారు, వత్సవాయి నరసరాజుగారు, నడింపల్లి రామభద్రరాజుగారు, దాట్ల చినవెంకటపతిరాజుగారు, భూపతి తిరుమలరాజుగారు, దంతులూరి రాఘవరాజుగారు, తిరుమలరాజు కొండ్రాజుగారు, దంతులూరి అప్పలరాజుగారు, చాగి నరసగోపాలరాజుగారు, జంపన వెంకటాద్రిరాజుగారు.

(Extract from letters Camp Padmanabhum 14 th July & from consultation.)

వీరుగాక రమారమి 150 మంది క్షత్రియవీరులు కూడా పడినట్లురిపోర్టులలో గలదు. కార్మైకేల్ వారి మాన్యూవలులో ఈయుద్ధములో పడినవారిసంఖ్య సరిగా తెలియలేదనియు నిందు జరుపబడిన వీరవ్యాపారమును బట్టి దీనిని ',Flodden of Andhra Chivalry,, యనదగుననియు గలదు.

దీనినిబట్టి చతుర్గోత్రములవారగు నాంధ్ర క్షత్రియులును తొల్లి కళింగమును మాధవవర్మజయించి బెజవాడలో రాజ్య స్థాపన చేసినప్పుడే గాక తుదకు ఇంగ్లీషుకుంపిణీవారి వంచనమువలన శ్రీమాధవవర్మ వంశీయులగు పూసపాటివారు A.D. 1794 లో కళింగ సామ్రాజ్యమును గోల్పోయినప్పుడు కూడ కలిసివచ్చి క్షాత్రవంశముల పౌరుష గౌరవములను తమ వీర వ్యాపారములచే నిలువబెట్టి యాచంద్రతారార్కమగు కీర్తి నిగడించి యాంధ్రక్షత్రియ వంశముల యైకమత్యము నభినవ ప్రపంచమున కాదర్శప్రాయము చేసిగనుట కెంతయు ముదమందుచున్నాము. రణరంగములం దేకమై పారిన యాంధ్రక్షత్రియుల వీరరక్తము శాంతియుగమగు నీనాడుమాత్రము స్వజాత్యభ్యున్నతికి నేకమై ప్రోత్సహింపక మానునా? క్షత్రియాన్వయులు గుర్తింతురుగాక!

ఇక నీగ్రంథమందలి కావ్యగుణములను గూర్చి మిక్కిలిగా వ్రాయనవసరములేదు. కవి పూర్వకవి సాంప్రదాయసిద్ధముగా జటిలముగా రసోచితముగా రచన సాగింపగలడనుటకు పెక్కు పద్యము లుదాహరింపవచ్చును గాని యిట్టి వీర వ్యాపారమును జూచినవాడగుట గాబోలు రక్తముడుకుడుకుగానున్న యపుడే కావ్యమురచించి యుండుటచే భావ నతి స్వేచ్ఛగా నతిధారగా, నిరాఘాటముగా, వ్యావహారికపద భూయిష్ఠముగా పండిత పామరవేద్యముగా సగౌరవముగా

నౌచితికి భంగము లేకుండ వాడినాడు. వర్ణించు నర్థములతో మనసుతన్మయము చేసి కవితా నిరంకుశత్వమును చూపి నాడు. వీరపురుషుడును ధర్మాత్ముడును అగు ప్రభువునెడల తన ఋణమీ విధముగా తీర్చుకొన్నాడు పరుల తప్పులకొరకు వ్రాయలేదు గనుక మన మెప్పులతో దీనికి ప్రసక్తియే లేదు గాని ఆంధ్రదేశచరిత్రకు మాతృకలగు కావ్యముల లోనిది ప్రధానముగ పరిగణింపదగినదని మాత్రము నిస్సంశయముగా చెప్పవచ్చును. ఈకవి రంగరాయచరిత్రమును చూచియుండినట్లే గ్రంథసంవలి నెం 121-123 రు ,,జనాస్సాలు,, పద్యములవల్ల పొడకట్టుచున్నది గాని యేరచనదేనికి మాతృకయో చెప్పజాలము.

దేవిప్రసాదము ఆంధ్రభారతి
తీర్థపరిశోధక విశ్వవిద్యాల
యాస్థానము విజయనగరం

బుర్రా శేషగిరిరావు,
సంపాదకుడు.
ఆంధ్రభారతీ తీర్థప్రధాని.



జలధిసీమాంత ఘోషంబుకెందు
నిరాట్ర్వుతానంబు తోరాక భాస్కరుం
డుదయాస్తమయాచలముల నడుగువేడి

గీ. అమ్మహాత్ముఁడు వినుతిసేయంగ నెగడె
వంగవంగాంధ్ర మత్స్యకళింగ చోళ
బర్బరపుళింద మగధ భూపాలసభల
విజయరామావతారమై వెలయు ప్రభువు 8

క. శ్వేతచ్ఛత్రము శత్రు
వ్రాతకఠోరాంధ ముదమున రాజులుచుండెన్
శీతాంశుఁడన ననేక
జ్యోతలపతి విజయరామ చంద్రుఁడు ప్రబలన్ 9

గీ. సర్వసర్వంసహా మహాచక్రమునకు
చక్రరక్షకుఁ డనగ రక్షణముచేయు
రాజరాజును దానూన రాజరాజు
విజయరామ క్షమాభర్త విశ్వకర్త 10

క. పాలించు సర్వ ధరణిన్
బాలించు ధరామరాళి బహుళభంగులగో
పాలుగతి నఖిలజనములు
మేలనగా విజయరామ మేటికిరీటీ 11

సీ. తనకీర్తి సాహసోద్ధతికోడి మృగరాజు
విదితంబు గుహాలలో నొదిగియుండు

తనచెల్వతును దానమునకోడి రేరాజు
నిరతంబు కొలలేక దిరుగుచుండ
తనదయా గాంభీర్యతలకు జాలకనదీ
రాజహార్నిశములు రోజుచుండ
తన ప్రతాపము తేజమును జూచిభయపడి
దినరాజు మేరువ నెనసియుండ

గీ. నారవీరాధివీర దుర్వారశౌర్య
ధుర్య సూర్యకులాంభోధి తుహినకరుడు
విజయరామావతారమౌ విష్ణుమూర్తి
కొలువుగూర్చుండె భీష్ముని చెలువుదోప 12

సీ. మాళవద్రవిళ పాంచాల మత్స్యపుళింద
బర్బరదేశాధిపతులతోడ
కర్ణాట కురుకు త్రిగాంధార కాశ్మీర
బాహ్లిక యువనాశ్వపతులతోడ
సంగవంగాంధ్ర కళింగ విదర్భ నే
పాళఘూర్జరనర పతులతోడ
మగధకోసల సింధు మద్రమహారాష్ట్ర
పాండ్యకొంకణ గజపతులతోడ

గీ. తారకలతోడ దగుసుధాధాముడనగ
విశ్వవిశ్వంభరాభర్త విజయరామ
చక్రవర్తి మహీనాథ సమితితోడ
కడిమితో నిండుపేరోలగమునసుండు 13

చ. మరియు సమస్త భూభుజసమాజము మంత్రులు వీరపురుష్యు
లుఁ। వరుస హవాలుదారులు ద్విభాషులు ఖార్చుకిషీలు
నాయకుల్। తురగరథాది రోహణులు దోర్బలధుర్యులు
సైన్యభర్తలుఁ। నిరతము గొల్వఁగొల్వు ధరణీతల నాధు
డు సేయుచెల్వునఁ 14

చ. కమలభవాండ భాండపరి కల్పితమైన విచిత్రవస్తువుల్
క్రమమున సర్వదేశముల రాజులు కానుకలియ్యచిత్తమం
దమిత ముదంబు నొందుచు మహాద్భుతమందుచు సింహా
పీఠిపై సమధరణీ తలాధిపులునన్నుతి సేయకిరీటభర్తయుఁ

ఉ. ఫాలములందు జేవురు, కృపాణము ఖేటముమూపులందు
మేల్। ఫాలము హస్తమందు కడు పచ్చనిరంగు శరీరమం
దు పి। సోళులు మధ్యమందెలుపు చూడ్కులు భాసిలరా
గిమీసముల్। వేళుల దువ్వుచుఁ గవుడ విప్రులనేతులు గొ
ల్వఁ చెల్వునఁ 16

మ. బరిశీల్ బాఁకులు జు రకత్తులరిగెల్ భాసిల్లవక్షంబులం
దరుణ శ్రీకరరక్తచందనము నిత్యప్రీతిగా దాల్చి భీ
కర కాలాంతకుఁబాటి పట్టగలసౌభాగ్యస్ఫూర్తితో బాండిలీ
సరదారుల్ బహుమందిగొల్వఁగొలువై తేజ్మ పాలర్సంబొగిన్

మ. చటులాకార కిశోరవక్షులరుణచ్ఛాయావిరాజాక్షులు
త్కటబాహాబల శౌర్యదక్షులగుచుం గర్జిల్లుచుం జేతులఁ
బటుబాణాలొగిబూని ఘోరరణ శుంభ ద్వైరిఢీ ఘాటించివి
స్ఫుటమైకొల్తురు బారుదీర్చి సతతంబుంగుర్వ పాళీలొగిఁ

ఆ॥ ప్రళయకాలమేఘపంక్తి గర్జిత్రెటి
కరణి ఘోరసింహగర్జనములు
నుర్వికంపమొంద నోడ్రిభటాళి
బలసి కొల్చి చక్రపాణులగుచు 19

చ. తలల మయూరపింఛములు దండల జేవురు గుడ్డచుట్టలున్
మొలల ననేకఖడ్గములు మెరాకులదిద్దిన చిర్రిపట్టెలున్
గొలకుల నెర్రిచుక్కలును ఘోరశరాసనపాణులై మరిన్
బలుపిడిగొల్చి సన్నిధిని బాయనమన్నెపు వీరసైన్యముల్

గీ. పసిడి నిండారజేసుదాళ్ళు బాకులూని
చెలువుమీరంగ ప్రభువు తాజీమిడంగ
కోరికొల్చి బరోబరి గూరుచుండి
పన్ననాయక వెల్మభూపతి చయమ్ము. 21

ఉ. పూచిన కల్పభూజముల పోలికమేలికడాని రత్నభూ
షాచయ రమ్యకాంతుల విచక్షణ సేయుతనూవిలాసముల్
చూచిన పౌరలోకముల చూడ్కుల పండువసేయుచున్
సదా! రాచకుమాళ్ళు గొల్తురు నిరంతరమున్ బదికోట్ల
సన్నిధిన్ 22

మ. కనుదోయింబ్రళయాగ్నికీలలడరంగల్పాంతకాలాంతకున్
జెనకంజాలు పరాక్రమస్ఫురణ చేచేఖడ్గముల్ కుంతముల్
ననరందాల్చి రక్తచందనము డెందంబందునంబూని పూ
చినమందారమహీరుహాళికరణిం జెల్వొందునయ్యొంటరుల్

అచలాచలాంఘ్రి సమాజఘట్టణభార
భరమున గడగడ ధరణివణక
నాదుకు తిరుగు మహేదార్ల విచ్చుగ
త్తుల తళత్తళలు దిక్కులుజళింప
లయను చెప్పేడితంబు రాల ధణంధణ
ధ్వానంబు భూనభోంతరము నిండ్రియ
గీ. ఘనపరప్రాణ విక్రియధనముదాచు
పెట్టెలోయన డబ్బాలు గట్టిమరియు
చెకుముకి తుపాకులూని గర్జించుకొనుచు
వీరభటుల పటాలముల్ వేలుగొలువ 33

క. అచలాచల భటపాద
ప్రచయసముద్భూత రజము.ప్రబలె ఘనంబై
శుచిఖడ్గ జాతజాతము
రుచి మించుచున్మించులని నిరూఢింబల్కగ 34

ఉ. ఆలములన్న వెన్కదిరుగాడని విక్రమశక్ర నందనుల్
వేలకునొక్కబంటు తగువీరుల నంగడిదేరి చేత డ
బ్బాలుననిలు నుంగల తుపాకులు బూనిసఘట్టి బాను పా
పాలజవానులెంతయు నిరంతరముం బహుమందిగొల్వగన్

క. చర్మశిరోవేష్టంబులు
వర్ణంబులు మీఱన్నిక దినవంశోద్భవ న

ద్రవ్యంబులు కోశంబు

.... .... .... .... .... .... .... 36

సీ. .... .... ....

.... .... మణులు

రాజమాన్యవిరాజ పూజితబిరుదాంకు

లాశ్రితత్రాణ పారాయణులును

గణితశాస్త్ర ప్రసంగ సత్స్ఫూర్తి నాటింప

చిత్రగుప్తుల సాటిజెందువారు

మూర్తిత్రయ పదాబ్జములు నమ్ముకొనువార

లమిత పరోపకారములవారు

గీ. స్వామికార్య ధురంధర సతతవితత

శౌర్యసాహసకీర్తి గాంభీర్యధుర్యు

లగుని యోగి మహీదేవు లనరతంబు

కొలువగొలువుండు నరనాథకుంజరుండు 37

సీ. సల్లక్షణంబుగా సతతచతుర్వేద

పారాయణులును జటావల్లభులును

షట్ఛాస్త్రములను శిష్యవ్రాతములకు శ

తావృతుల్ చెప్పిన కోవిదులును

సంతతాష్టాదశ సంఖ్యాపురాణముల్

నింపారజదివిన పండితులును

విధివిధానంబుగా విమలయోగాది క
ట్కర్మ నిరతులౌ సజ్జనులును
గీ. మరియునిరతాన్న దాతలై బరగుచున్న
స్మార్త వైష్ణవ మాధ్వాది సకలవిప్రు
లభినుతింపుచునుండ సింహాసనమున
గొలువుగూర్చుండు నృపవీరుండరుండు 38

వ. కొండియు నఖండ తేజో విభవసాంద్రవిరాజమానమా నిత జాతరూప సౌధగోపుర ప్రాకారాది దివ్యభవన స మాకృత పరిఘాంతర్భాగ నిర్మిత చంద్రకాంత శిలామ యస్తంభ సహస్రప్రభాసితాస్థాన మంటపాంతర ఘటద్ధ గ్రథిత వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత పద్మ రాగ నీలప్రవాళముక్తా ఫలాది నానారత్న పరంపర ప్ధగి త మహోన్నత కళింగరాజ్యలక్ష్మీ సమాకర్షితా సర్వ సింహాసనా సీనుండును, నైర్మల్యహృదయ పంజరనివేశా సీనరాజ హంసాయిత పుండరీకాక్షుండును, నిరంతర చతు ర్దశభువన పావనాది నారాయణానంత చరణ సరోజాతజా త గంగానదీతోయ స్నానపానానేక జన్మార్జిత దురంతదు ష్కృత విదళనుండును, శ్రీమన్మహీమండలీ రాయమన్నె సుల్తాను కళింగ పాదుషాకిరీటపర్యాద్యనేక బిరుదాంకి తుండును, చంద్రసూర్యాన్వయ చతుర్గోత్ర మహీపాల లోకాభివందితుండును, గోభూహిరణ్య కన్యాసాలగ్రామ

తులాపురుష ముఖసకల దానవ్రతుండును, దానపాత్ర
సమాశ్రయాజానుబాహాయుగళుండును, లీలామాను
షావతారామానుష చర్యుండును, చతుస్సముద్ర ము
ద్రిత మహీచక్ర పరిపాలకుండును, వేదాంతజ్ఞాన సంప
న్నుండును, విశ్వవిశ్వంభరా దేవతాశీర్వాద సంప్రాప్త
సంత రాజ్యవైభవ విసర్జిత సునాశీరుండును, పురాణపు
రుషుండును, పుణ్యశ్లోకుండును, సత్యమాన హరిశ్చం
ద్రుండును, ఏకవాక్య ప్రతిష్ఠాపనాచార్యుండును, ధనుర్వి
ద్యాప్రవీణ భీష్మద్రోణార్జున త్రిలోచన తుల్యాధికారుం
డును, సుగుణాభిరాముండును, సాహస మృగేంద్రుండు
ను, దయాసాగరుండును, బ్రహ్మాండభాండపూరిత సము
న్నత కీర్తి విజిత పయఃపారావార గంగా సితాంభోజాత
చంద్రచంద్రికా కైలాస హిమాచల దేవతామహీజాత
తారా నారద కుందవజ్ర ముక్తాఫలస్ఫటికశరత్కాలాంభో
ధరుండును, మేరుమందర మహీధర స్థైర్యుండును, గాంభీ
ర్య రత్నాకరుండును, మార్తాండ మండలాంగారక స్వర్ణ
కుంకుమాంభోరుహ మందార కుసుమవిభ్రాజితప్రతా
పుండును, చంద్రాభ్రకల్ప పారావారాంభోజాతాప్తకు
మార సమాన ధౌరేయుండును, లక్ష్మీకుమార జయంత
వసంత సంపూర్ణశీతకిరణ యదునందన తనూవిలాస సంప
న్నుండును, శౌర్యవైశ్వానరుండును, శరణాగత వత్సలుం

డను, పాంచాల వత్స బర్బర మత్స్య మగధ కోసల సింధు మహారాష్ట్ర ఘూర్జర యవన పుళింద విదర్భ నేపాళ బాహ్లీక సూరసేన గాంధారాంగవంగకళింగ సాళ్వ కోంకణ కెంకణావంతి కుకురు త్రిముఖ్య దేశాధీశ్వర ప్రదత్తానేకదంతావళ తురంగ రథఖడ్గరత్నఖచిత కాంచనాంబరాభరణ ముఖ సకలవస్తు సందోహ కించిత్పరీక్షితాపాంగ లోచనుండును, సూర్యవంశ కలశోదధినిశానాయకుండును, వశిష్టగోత్ర పవిత్రుండును, శ్రీవ్యాసపాట్యన్వయాగ్రేసరుండును, రామభద్ర రాజోధర ఘనీరత్నంబును బంగారుతల్లి గర్భాంభోరాశి దివ్యరత్నంబును, సగుణశ్రీవిజయరామ మహారాజ దేవేంద్రుండొక్కనాడు నిస్తంద్రసాంద్ర మహారాజ్య భారధౌరేయుండగుచు, భద్రదంతావళ సింధుసైంధవ శతాంగారోహకులును, పదాతిచయంబును, ముసలముద్గర భిండివాల శూలగదాఖడ్గ చక్ర పరశుపట్టిస బాణబాణాసన కుంతకరవాల ఖేటకస్థూణాతూణ ఘటికాలోహనాళాద్యనేకాయుధంబులు కరంబుల ధరించి చతురంగ బలంబులు తన్నుబరివేష్టించి కొలుచుచుండ తారాసమూహంబుతోడం బ్రకాసించు సంపూర్ణ చంద్రుంబోలియుం గ్రహమండలంబుతోడం తేజరిల్లు చండమార్తాండ మండలంబు ననుకరింపుచు సకల దేవతా సైన్యంబులతోడ నొప్పు గాంగేయుని చందం

బుగా నేకాదశాక్షౌహిణీ సమేతుండగు సురనదీ నంద
ను విధంబున కమలలోచన సహాయంబుగా సప్తాక్షౌహిణీ
చతుస్సోదర కుమారవర్గంబుతోడ నొప్పుపాండురాజనం
దనాగ్రేసరుండగు ధర్మతనయుని పధంబునం, గిరీటకవచ
కుండల కేయూరాంగాది సమస్తభూషణాలంకృతుండై
పేరోలగంబున గొలువుగూర్చున్న సమయంబున. 39

క. కరములు మోడిచి గడగడ
చరణంబులు వణకరాజ చంద్రుని మ్రోలన్
దురుసుపడకుండ మెల్లగ
నరిగించె దివాను మనివియిట్లని వరుసన్ 40

ఉ. దేవపరాక్రమ, సర్వజగతీతలమెల్లను కాటకంబుచే
చేవదొరంగియుండుటను జేసి పదార్థము కన్ను చెల్లగా
గావున సమస్త జన్మములు గావున బారుసమన్య భూపతుల్
దేనరవారితో మనవి దెల్పుడు జేయగ వచ్చి రెంతయున్ 41

సీ. అదిగాక నిజరాజ్యమందు ముస్తాజరుల్
తాలుకాల్ జేసి యర్థంబుమూడు
వాయిదాల్ చెల్లించి వైచియీనేటికి
కడమపదార్థము కడమయునుచు
బ్రతిమాలుచుండిర ప్పనిగాదు తెమ్మని
యడిగినగ్రామముల్ చెడునటంచు
బేలత్రిప్పోకుండ నాలవాయిదా
హాలుసాలునకు కాపయ్యెనందు

గీ. ప్రస్తుతంబున జనుస్త్రైన పైకమెల్ల
గూర్చి పదిలపఱిచ్చి తక్కువధనంబు
వెనకనుంచి చెలాయింతుమని రశీదు
లిమ్మనిన కుంపిణీవార లిట్టులనిరి 42

క. ఇన్నాళ్ళనలెను గాదిప
డెన్నివిధంబులను పైక మించుక బాకీ
యున్నను రశీదు లీమని
చెన్నాపట్టణపు వద్ది జెప్పిరిమాకుఁ 48

క. కావున బాకీమాటలు
వేవేగం జెప్పినాము వినిమా పైకం
బీజేళఁ దెచ్చి ఝాండా
గాలించుడటంచు దెలియగా జెప్పిమరిన్ 44

శా. సందేహంబుగ జెప్పనేమిటికి రాజా జీసమీపానని
చందంబెల్ల నెసంగ జేసి నడిగా జాత్రగా విరాజమా
బందీవార్వదళలక్ష శుభ్రములు బేబాకా చెలాయించితే
పొందుస్మీకునుమా ఖలత్తు నచుకెంపుంగంటవాటింపగా 45

ఆ సీమవద్ది వచ్చె చెన్నపట్టణమున
కచటనుండిబంద రదియొవచ్చె
నంతనుండియిచట కరుడెంచెనావద్ది
శిష్యుమునను దెలియజెప్పినాము. 46

మ. అటుగాకున్నను నాడువచ్చికమిరీ యుద్ధంబు రెట్టించి మా
చుటమాబోంట్లకు గోచరంబిపుడి దే చూడంగనాలీను సే
యుటకుంగారణమేమి మీమదిని దేమూహించుటో కాని యె
ప్పటికింగార్యము గాదటంచును తలఁ పంకించిము మ్మాటికిన్

క. బాకీర్యూడా నేసాక
మాకూమీకూను తొంటి తూటలు నడునం
గాకుండుగాన మీనర
లోకస్వామికిని దెల్పులో వైనముగాఁ 48

మ. నుతలాయించుచు మామిలీతిపుడు మానామ్లెల్ల చెల్లించితే
సతతంబుం భవదీయకార్యములు రాజా జెందు నీమాటమీ
క్షితి నాభాగరిణి సన్నిధిం దెలుపుమీ శీఘ్రంబగాకున్న మం
చి తనంబుల్ మరినీవ్వ నేరవుసుమీ చేచేవిచారింపగఁ 49

క. రాజ్యాపేక్షితు లేనిం
బూజ్యంబుగ మాకు దార్థముంగట్టిన మీ
రాజ్యము నిర్వ్యాజ్యతబుగ
నాజ్యపు దీపికయనంగ నలరుచునుండున్ 50

ఆ గానవిన్ని చెప్పగా నేలపైకంబె
ఝుడితిగాక మాటచక్కపడడు
యీరసంబు వేల సారించిసారించి
కణగిదెల్పు రాజు గారితోడ 51

క. అనియిట్లు పెక్కుభంగుల
జననాథునితోడ మాటజరిగించు మటం
చునుబంచిరి తమచెంతకు
ననునేడు విశాఖపట్టణపు దొరలెల్లన్ 52

ఉ. అల్ల విశాఖపట్టణమునందున గల్గుదొరల్ సమస్త
దెల్లముగాగ సంవరొకదిక్కున గూడుకొ పెద్దపొద్దూరం
జెల్లగ కంపతేరి తగజేసి లడాయినిశ్చయంబు రాజుతో
నెల్లియటన్న మాటలట నెంతయునాచెలిసాగె భూవరా

మ. అనిపల్కన్ విని రాజసింహము సముద్యత్కోప వేగంబునన్
గనుదోయిన్ జవవహ్నికీలలడరన్ గాండ్రించి నెమ్మోముగొ
బ్బునసాస్థానము జేరిచూచి పలికెన్ భూరిప్రతాపంబుతో
ఘనగర్జాయిత వాగ్విజృంభణముల భూకంపంబు వాటించగా

శా. ఏమేమీ కలహించి జాతిదొరలిట్లీలా లడాయించి సా
మాన్యమ్ముం బలుకంగ వారలను మున్నే నాడ బద్ధంబుచే
నీమాటల్ జరిగించి నాయిపుడు కాదేమా విచారించి నా
రా మాటల్ బని యేమి స్వామి యని కంపించున్ విజృంభించు
చున్ 55

గీ. పుండరీకయుగంబున బోలుకన్ను
లరుణపద్మద్వయంబును నతిశయించె

పూర్ణచంద్రునితో సూటి బోలుమోము
పరిశ గాలార్కబింబంబు పగిదిదోచె 56

మ. సభకంపించె ధరిత్రి చలించె ధరణీచక్రంబు పొంగెన్ వడిన్
సభముల్ కెలంకులందునను సైన్యంబుల్ ఖణా
యించెనే! సభరాయించినేక సమూహములిపు దేశార్యంబు
సేయంగనీ! విభుడేతెంచునో యంచు నానృపమహావీరుండు
కోపించినన్ 57

మ. అపుడా రాజకులావతంసము మహాహంకారముం బూనినన్
దపియించెన్ నిజ కాంతి నళులు ముస్తాదయ్యె సైన్యంబుల
య్యపరాధుల్ దలతెత్తరయ్యెను శాస్త్రవాత్రిత ముంజేయు
త! త్కపటాలోచన మెల్లవారలకునిక్కంబయ్యె నూహింప
చగన్ 58

క. జననాథుడు కోపించిన
వననిధిఘోషించె ధరణివణకెను మింటన్
దిననాథుడు చలియించెను
జనులు భయంపడుటకింక సందియమున్నే 59

వ. ఆసమయంబున గోపతిసేవ్రు నిజమనోరథంబునం గార్యా
లోచనంబు విచారించి యుదినిమిత్తకాత్రంబుగా మన
తోడం గలహించి కుంపిణీవారలచే కాలంబులనుండి య
న్నదాత్యజాస్యపహారంబు చేయ నుద్యోగించి యున్నవారది

యుండఁగా శాజేఖోరు దుర్మార్గులనేక దుస్తంత్ర దుర్మం
త్రాంగంబులు వారితోఁ డంజేయుచున్న వారెన్నివిధంబు
లం గార్యంబగుటకు సందియంబులేదైన బూర్వోత్తర
ప్రకారంబు విచారించి కొంత శాంతించుట యుచితంబగు
త్వరపడుట కార్యంబుగాదని నిర్ణయించి కొండొక సేపువిచా
రించి యమ్మహారాజ కంఠీరవం బతనితో నిట్లనియె 60

గీ. కుంపిణీవారు మనమీఁద కోపగింప
నేమిహేతువవ్వారి సొమ్మెన్నఁడైన
నపహరించితిమె యిట్టి నెపముజేసి
వంచనము సేయఁగా మదినెంచినారు 61

సీ. తమరు వంచన సేయ దలచుమాత్రమె కాని
తమకు మాకధికారి తలచిచూడ
గోలకొండ నిజాము లాలించి మమ్ముల
తొడలపై నిడుకొని కడుముదమున
పట్టాభిషేకసంభ్రమము గావించుట
యఖిలజగంబులు నదియెరుంగు
నంతియకాక మాయానంద గజపతి
రాజానుమతంబున నీజగంబు
గీ. లాక్రమించిరి తమరు మానకమహా నేడు
కీడొనర్చిన మేలు చేకూడగలదె

ఇంతవీరి కృతఘ్నత్వ మేమివింతె
కారణములేసి పోరు నిష్కారణంబు 62

శా. కాసిమ్మింక పనేమివారి సుగుణ గ్రాహిత్వంబు లేదాక
య్యోడుల్। నానాదేశపు వీరసైన్యముల కాజ్ఞల్ వ్రాసి
యీవేళ వే। గానంబంపుము రేపురమ్మనుచు వక్కాణిం
చి యిక్కంపిణీ। త్రోనక్ డబ్బులడాయి పార్కు తెలియం
దోడ్తోడ నేపారగన్। 63

సీ. సాలూరు మక్కువ పాలేరు బొబ్బిలి
బన్తరుగోలుకొండ పాలకోండ
షేరంగి కురపాము వీరఘట్టా కొండ్రి
మాడుగుల్ రాంపల్లి కేదకువిడెన్
పోరాము వడ్డాది పారాది గుణుపూరు
కాశీపురంబు శృంగవరకోట
పరిజల నారాయణ పట్టంబు చీకటి
చామర్లకోటయు జయ్పురంబు

గీ. పొందలుగాగల్గు గడుమన్నెముల జమిదారు
కోటపల్లెలు తాణాలకునుబిరాల
నాజ్ఞలు సలామణీచేసి యతిరయమున
లేచిరమ్మని ఘుతురు స్వారిలబంపు 64

మ. తమరానాడుకళింగరాజ్యమునకున్ దక్షుండవంచున్ ననున్
వరుసదం బొప్పంగ నంకపీఠనిడి శుంభత్రోథి పట్టాభిషే

నాలీసుమనకు గూడది
కేలా శ్రీరంగశాయిరయే కలడంటుఁ 70

చ. మనసరదారులంబిలచి మానసనివైరము జాతివారితో
బెనగొనెపూనపాటి నృపవీరుడుపోరున నోడెనేనియుఁ
వినుడునిజంబు కత్తి మొల పెట్టినవారికి కత్తి నీరటం
చునుదెలియంగ దెల్పుతమశూరత సార్థకమయ్యనేటికిఁ 71

ఆ. ఇవుడుపోరనోడె నేనినిక్కముగాఁగ
జాతిదొరలకింక సత్తితలంబు
కోరివోయుచుందురి సారాలకావడు
లోప్పువారివెన్క కుందుమనుము 72

శా. పేరన్వర్గములైగోరెనేని నిజదోర్వీర్యంబు నంధిల్లగా
ఘోరాజిఁ శతపక్షిరక్షిత బలక్షోభంబుగావించి జం
భారాతిందురిపురంబు బంపిసను యోగ్యంబు బట్టుగా చేనియా
సారాకావడు లానుమోయుపనికిఁ సంప్రాప్తులైయుండరే

మ. మేమననేల సాహసమేతులు హారలుకుంతధారులై
భీమసమానులై పగరపిండులగుండెలు తల్లడిల్ల నం
గ్రామముసేయజాలిన మృగపక్షరంబుల జుట్టుముట్టగా
పేరిమము తోడవచ్చునల బెబ్బులితండము బోలియుండరే

గీ. కడము మనకుసకల కార్యముల్ యాధము
వింతయేమికడమ చింతయేమి

యన్నగారువెళ్ళి చెన్నపట్టణమున
నున్నవాటమాత్రి మొంకటికొదువ 75

మ. అనిచింతింపుచు పూసపాటి నరలోకాధీశ్వరుం డాత్మలో
నని కొండాడకవిచార మగ్గునదపమున్ దారొక్కన్నదికా
ర్యమింక నను జాగేల బిరాన ఘోరశర సంగ్రామంబునన్
శత్రుడు! దుసవిశృంఖలను సేయకున్న మనకున్ శౌర్యంబ
వార్యంబౌకో 76

క. అని నిశ్చయించి యప్పుడు
జననాయక చక్రవర్తి సన్నిధిగూర్చుం
డిన బాల సూర్యసన్నిభ
తనుభాసితుడైన ముద్దుతనయుం గాంచెన్ 77

సీ. కుంభసంభవుచెంత గూర్చుండి సర్వదా
బరగు సత్యార్థాను కరణి దోప
దశరథ ధారుణీధవుని సమీపాన
భాసిల్లు శ్రీరామభద్రు డనగ
వను దేవనరలోక వల్లభులుంగల
గనుపట్టు కృష్ణుడిగ్రామణులిల
వైకుంఠనగరు నివాససమీపాన
చూపట్టు పత్తిమ్మిచాలు నగిది

ఆ. నాదినారాయణాంశచే నవతరించి
దివ్యమంగళమూర్తియై తేజరిల్లు

ఉ. భీమశతఘ్నికాబిలకృపీటభవారుణ తప్తమై మహా
ధూమసమేతమై యాశనితుల్యములౌ ఘటికాపంపరల్
వేమరుగప్పుచుం బుడమి బీటలువారగ జేయునట్టి సం
గ్రామము జూడగోరెదవుగా తగునేయిది నీకు బాలకా! 83

మ. వలదోయున్న శతాననాధిపులు దుర్వారుల్ జ
దా! దులుఘోరోక నిశాచరుల్ కడమసందోహంబులు
చెప్పగా! తులయెవ్వారు కృతాంతకింకర మహాస్తోమంబు
తో! పటివారలు నీకేల కఠోరసంగరము కార్యంబేమి
పేక్షింపగన్ 84

క. అనిపలుకు తండ్రిమాటలు
వినియుజ్జ్వలుడు రాజవీరుడు నాపై
కనికారమునను గాఁ
యనజెప్పిన భయముగలదె యవనీనాథా 85

గీ. హేలువాదులు జాతివారేలకాదు
ద్రోణ భీష్మార్జునాదుల తోడనైన
నదుకుపడువేళ భయపడనయ్య నేను
తమకెలవు గోరియుంటిని సమరమింత 86

క. బాబయ్యగారి యానతి
కేబెదరితి నింతెకాక నిఖిలక్ష్య[illegible]

ళ్ళకల దేరువారు వెనుకయ్యము సేయగ నోఃకు గెల్పులన్
దేకడలెందునో యనుచుసిప్పుడు దెల్పితి నీకుసర్వముల్. 95

గీ. రాజధర్మంబు వినుము సంగ్రామమున్న
భయపడగరాదు వెనుకకు పదము వేయ
నెదురుగానేగి పోరాడెనేని యతని
కిలను స్వర్గంబునందును గలదుసుఖము 96

ఆ. ఏకపుత్రిజోట యింతింత యనరాని
ప్రేమమగ్గింప భూమిభర్త
తొడలమీద ముద్దుకొడుకున నిడుకొని
శిరముద్రిప్ప కరుణజేసిపలికె 97

క. అచందార్కము నీవు మ
హీ చక్రంబేలవయ్య యేకాశ్వర్యం
బై చతురుపాయములచే
నాశకృని ముద్దుబాల నతజనపాలా 98

మ. అనిదీవించి మహీతలాధిపుడు నెయ్యంబొప్పగా పూర్వరా
కనమ్మపాత్రము ఖడ్గరత్న మశనిచ్ఛాయామ్నముల్ చేతికి
చ్చి నమస్కారముగాంచిసత్కరణ నంచెం మామగారింటికా
యనవేంచేసె యథోచితోత్సవముగా సర్వోళసైన్యంబు
తోన్ 99

మ. అటధాత్రీతల చక్రవర్తి సితవక్త్రానీకవిచ్ఛేద స
మ్మటనాలోచన చిత్తుడై కనులగెంపుందోపగా దాట్ల వేం

కట పశ్యాపనిపాలనిం బిలచి శీఘ్రముంబింక జబ్బెల యి
క్కుటిలారాతిపరంపరల్ దరమిరాకుండన్ విచారించుమిా

చ. అనవుడు దేవచిత్తమని యచ్చటనుండిన యూథనాథులం
గనుగొని మిారలింక నధికత్వరితంబున సైన్యయుక్తులై
యనికితయారు గండు మనమందరమున్ వినుచుండనిపుడే
జనపతియానతిచ్చిన ప్రసాదముకై వడి నుండకావలెన్ 101

గీ. ఖానుపారాలు పారాలుగట్టిగాను
జోరుపారాలువెట్టించి వీరసైన్య
ములను వారికి మద్దతు నిలిపిమరియు
నఖలజాగ్రత్తగానుండి రందరచట 102

క. యీరీతి విజయరామ
ధీరమణుం డఖలబంధు సైన్యంబులతో
సారెకుజాతుల వారల
బోరించుచు పద్మనాభమున నలరనటన్ 103

ఉ. అంత విశాఖపట్ణమునందున మేస్తరు కల్కటేరి వా
రెంతయు పూనపాటి ధరణీందుప్రదుజాతులవారి మర్మమా
ద్యంతము గుర్తెరింగి యపుడర్థముగట్టుడు లక్ష్యపెట్ట డీ
శాంతమువల్లకార్యమిక చక్కనగాదుల దాయిదక్కగన్.

క. భయపడడు సంగరమునకు
జయమును నపజయముసేయ స్వామియెయనుచున్
నియమించి యుండెనాతడు
తెయితేలా మనల లక్ష్యపెట్టని మాటల్ 105

మ. అనిపామీరాసు కఠోరవాక్యముల సంఖ్యంబాడి కర్నెలుతో
మనతోరాజు లడాయి సేయునిది సామాన్యంబుగానింక నీ
వునభీతిల్లక గెల్చి వచ్చినను మెప్పుం జెందనిక్కుంపిసీ
కనయంబాదధి కారివివసిన మిన్నందెం దడాశోచనన్ 106

చ. అనిరమణప్పనాయకుని నప్పుడురమ్మని చేరబిల్చియ
జ్జనపతిచెంతికుంజనిన సంగతులేమి యతండుమాకు లొం
గునొ మముగెల్చునోమరియు కుంపిణివారని వెన్కతగ్గునో
తనబలయుక్తుడై కణగిదార్కొని పోరున కేగుదెంచునో 107

గీ. తెలియదెల్పుమచట గలచందమెల్లను
నెవ్వరెవ్వరందు నెట్టులుందు
రేమి జెప్పకూడ దిమాటవారిలో
పిన్న పెద్దలెవ్వ రన్నతడు 108

శా. వీరాగ్రేసరు శత్రుభీకరు దయావిష్ణుస్వరూపుల్ మహో
దారుల్ధీరుకళింగ దేశనృపమార్తాండుల్ సదాభావముం
దారుల్ సూర్యకులాబ్ధి చంద్రునిసరేంద్రగ్రామణిల్ ధీమ
ణిల్। మారోదంచితరూప నావిజయరామ క్ష్మాతలాధీశ్వ
రుల్। వీరాగెల్చెదువారు చాలరనిపేర్మిం దెల్పెగొండెం
బుగా 109

గీ. వెలయపూసపాటి విజయగోపాల రా
జనికి గణగ సేని యతనితోడ

నర్జునుండు జాలడనుమాట మీరల
ఱెరిగియున్న భారతే దెలుప 110

క. ముక్కంటి కంటిమంటల
నుక్కణపగ జాలు నాహవోన్నతశౌర్యం
బొక్కడె చాలు నభిమన్యు
గ్రక్కున నిచ్చటికి జేరగా దరుమంగా 111

గీ. చాగిగోపాల నరస భూజాని సైన్య
యుక్తుడగుచు నరోలునుండె నేని
కుంపిణీవారు గారలగోలకొండ
పాదుషా తర్లివచ్చిన భయముపడదు 112

గీ. దాట్ల వేంకటపతి రాజు దళముతోడ
తొలగిపోక లడాయిలో నిలిచెనేని
హేలుదాదుఖా కెత్తును లేలకాదు
కుంభసంభవుడైన తగ్గుటనిజంబు. 113

గీ. అతనిసోదరు డప్పలక్షితివిభుండు
ప్రాణమిడుగాని తొలగని బంటుగంటె
ఘోరసంగ్రామమున నుండదుగుండనతని
బారులోన తుపాకీల బారుదూలు 114

చ. సురపతి నందనుండు మధుసూదన యుక్తముగాగవచ్చినం
గర [illegible] నరించినక భయముగాంచని వీరుడు శాతకుం

తముగా। గరమునబట్టినిల్చిన చకాచకసేయును శతృకోటి
నా। నరసుడు వత్సవాయి నరసక్షితిపాలున కెవ్వరీడిటన్

గీ. అల్లజంపని విజయరామరాజనీంద్రు
తోటివెవ్వారుసాటి యమ్మేటిమగని
ననినిగెల్వగ గురుతనూజాదులైన
నోపరనుమాట మీరెరిగున్నమాట 116

సీ. పదివేలచకుముకీ బారులనైనను
బరిమార్చివేయ నొక్కరుడెచాలు
కోటికాల్బలముల కూటమూత్రిమ్మిన
కడతేర్చివేయ నొక్కరుడెచాలు
లక్షగుర్రములైన లక్ష్యమ్ముసేయక
దురముగాలించ నొక్కరుడెచాలు
శతసహస్రమదేభ సమితినొక్కుమ్మడి
గ్రిమ్మివేయంగ నొక్కరుడెచాలు

గీ. అట్టివీరాధివీరుడు హసనుబేగు
మునలిమానుకున్నందాను మొదలుగాఁగ
యూధనాథులసేకు లందున్నవారు
ధరణియీనిన కైవడి తెరపిలేక 117

ఉ. వారిపరాక్రమంబు లనివారితముల్ దలపోయనెంతయున్
వారలతోటిసాటి మనవారలలోపల నాకుచూడగా

తేరని దోచుచున్న యది లేశముజంకక నీటనించిన
ట్లూరక యున్న పౌరుషము యొద్దను నేరము లేదటంచుఁ దట్టన్

చ. కపటము జేసి గెల్వవలెగాని మహీతలనాథచంద్రునిన్
నిపుణత చూపిపోరిన గణింపక గెల్చును మిమ్ము నాతడే
నెపమున భేదపెట్టుకరొ నేరుపు మీరగ జిక్కె నిక్కమై
చపలవిచారతం దెలుపు సైన్యము మొగ్గంగదు మన్నకర్ణముల్

క. అనిపలుకు నతనిమాటలు
వినివిని దావాగ్నిశిఖలు వెలుపడుచుండన్
గనుదోయివిచ్చిచూచుచు
కనలుచు నిట్లనుచుబలికె కన్నెర్రలుగాన్ 120

సీ. పులిచెరికోట గుప్పున లోటుచెయ్యగా
మూడు ఘంటలలోన నోటుపరచి
కాశిగయా ప్రయాగములు సాధింపగా
గంటాచతుష్కము గాక మున్న
నఖిలభూమండలం బాక్రమింపగ లేదె
రైదుఘంటలలోన మైదు జేసి
శ్రీరంగ పట్టణం బారుఘంటలలోన
గాళుమేలుగజేసి కలచలేదె

గీ. అట్టివారికి పూనపాట్లవనిభర్త
కొండయని తెల్పుడీవు మాగుర్తెరుగక

నేడుఘంటలలోన నా కెంతయైన
గెలిచెదరు కుంఫిణీవారి చలమువినుము 121

ఆ. చిత్తమిట్లుమీరు సెలవియ్యమారాద
జాలగాని వారిశౌర్యమెన్న
నలవిగాదు లేశమందులోపలవిన్న
వింతుననుచు బలికెవేగవేర 122

సీ. రావణకుంభకర్ణ ప్రౌఢిమీరిన
కపులాముబారువార గొట్టలేదా?
మాలీసుమాలీ సమానుశావనవర్ధి
నూర్ధ్న సుఖానులన్ మోదలేదా?
బకగార్ధభాసుర ప్రకట బలాఢ్య వాం
సేను నాంతుల్లాల జెండలేదా?
ఖరదూషణలబోల గలమహారాష్ట్ర బు
ద్ధోజీ భటోజీల దోఁచలేదా?
గీ. పూసపాట్యన్వయంబున బుట్టినట్టి
వారిమహాత్మ్యమెన్న నెవ్వారితరము
దైవవశమున నొకవేళ తమకునేడు
సాధ్యమైనను ముంగలజాలువారు 123

క. అనియిట్లు పద్మనాభం
బున వారలడాయినేయ పూనికతోనుం

డిన మాటదెలుప కర్నేల్
కనుదోయిని నిప్పులొలుకగా నిట్లనియెన్ 124

మ. పులిమీసంబుల నూగగాదలచెనో భూనాథుడీ కుంపిణీ
బలమున్ గండము లేక నిర్భయ మనఃప్రజ్ఞాధురీణుండునై
దెలియం జూచెదమింక నేమిటికి సందేహంబు దావానలం
బులు మావద్ద ఫిరంగులీజగములం బూర్ణాహుతిం జేయగన్

చ. అని తనటోపిదీసి కరమంతయు ముక్కలు నూడగ ద్రొబ్బుచున్
గనలుచు రోజుచుం ధరణి గంపమునొందగ నుద్ధతస్వరం
బున సిరుమాలుచుం దనసమూహము గన్గొని హేలుదా
ములం! బనిగొని యిట్లుపల్కె కదుభంగుల యుద్ధసముద్ధ
తిందగన్ 126

గీ. విజయరామావనీనాథవీరుతోడ
సంగరంబయ్యె నేడు ముస్తాబుగండు
పద్మనాభంబునందు పార్థివుండు
గెలిచివచ్చినవారికి గలదు మేలు 127

వ. అని తనజాతిభాష ననయంబు నయంబు భయంబు దెల్పు
చున్ ! కనుగొన లన్నిబుంగురులు గ్రమ్మగనమ్మిగ హేలు
దాదులన్ ! గనియిట్లు బల్కె నేడు పెనుకయ్యాతువయ్యెన
శాతనిల్లెన్ ! బ్బున పయనంబు గన్నునుచు భూరిరయం
బున వర్తిదెల్పెన్ 128

సీ. గిరిశిఖరంబుల బెరయుమబ్బులలీల
తలలందు టోలుటోపిలు వలిర్ప

ప్రాఁచినశాల్మలి భూరుహంబులపూఁడ్కి
మేనుల కుడశాలు గానుపింప
కరికరంబుల నుక్కుఁగదలన జేదుల
చకుముకి బందుకుల్ చెలువుమీఱ
తలుపుల గందపట్టెల నంగరొమ్ముల
కంచుబిళ్ళల త్రోలుకట్లుమెఱయ

గీ. శరధివెడలిన కలియుగాసురులసంగ
కణఁగియుంత విశాఖపట్టణపుకోట
వెలతెలతులు హాలుదాదుల పటాల
ములు మహీచక్రమెల్లను కలఁచజాలి

గీ. పుట్టవెడలిన యీసుళ్ళపుట్టమునఁగ
పట్టువిడు కందిరీగల తెట్టెవోలె
హాలుదాదులసర్వ పటాలములును
విక్రమంబున భూచక్రమాక్రమించె। 130

వ. మరియు దశంబులును, దశదశంబులును, శతంబులును, శతశతంబులును, సహస్రంబులును, సహస్రసహస్రంబులును లక్షలును, లక్ష లక్షలును, గలిగి లెక్కింప నశక్యంబు లగుచు చలిచీమల బారునుంబోలియు మిడుతలదండులతెరఁగున మశకసమూహంబు ననువున పట్టుఁ దేగిన తేనటీఁగల విధమున హాలుదాదులును, సర్వపటాలంబులును, నాఘనుల సైన్యంబులును, కవితానుల పరంపరలును, చిత్ర

విచిత్రంబులగు పరిఘాందోళికాది వ్యూహంబులు గట్టు చు యోజన ప్రమాణంబున నిసుకరాల నడ తెరిపిలేక మ దగజంబుల శతశతఘ్నికా సహస్రంబులును, గలిగి ఘ ర్ణశాటాదికంబులగు విశేషించిన శతఘ్నికాపాత్రంబు ల గ్రభాగంబునం బ్రకాశింపుచుండ షావిూరు కర్నెలు హీ నా మొదలగు శిబిరాధినాధ పరిరక్షితంబగు మహీచ క్రంబు గంపింప పారావారంబులు ఘూర్ణిల్ల పర్వతంబులు చలింప డికిలధ్వనితంబురాదివాద్య విశేషంబులు మొర యింపుచు సర్వేశ పద్మనాభంబను మహాక్షేత్రంబునకు క్రోశప్రమాణంబున నయ్యిరుదెరంగుల సైన్యంబులును, గయ్యంబునకుం గాలుదువ్వుచుండిరంత.

క. ఆరీతి నిరుతెరంగుల
వారలప్పద్మనాభ వాహినిపొంతన్
బేరామని నొండొరులన్
బోరుల గెల్తుమని వేలము లేని రహిన్ 134

ఉ. ఒండొరులట్ల జయింతుమని యూహలు సేయుచు రాజజాతి
వా। రుండిరి పద్మనాభమున నుర్వితలేంద్రుడు బోనిమెట్ట
లో। నిండిశిబిరాస్త్రకోటి, ధరణీతలమెల్లను చుట్టబెట్టెనా
ఖండలదైత్యనాయకుల కైనడిసయ్యెను వారుసైన్యముల్

క. చిప్పడలోని మొరకలు
గప్పె మహీచక్రమెల్ల గంపింపంగా

నప్పుడు శిలాస్యవాహిని
ప్పదరంభొని వారిచెనునుకి తళుకుల్ 134

ఆ. జాతివారలటకు జనుదెంచిరనుమాట
తెలిసిరాజలోక కులిశధారి
యపుడుదాట్ల వేంకటపతినరేంద్రుని
చేరబిలిచియిట్లు సెలవొసంగె 1.5

చ. తెలిసెనెకుంపినీమయిదు తెల్లముగా నిపుడెల్లవారికిన్
కలహమొనర్చగాడలచి కార్యముపొక్కున జెందకుండగా
మలసెలుబెట్టినారికను మంచిది చూచెదమెల్లయోధులన్
బిలిచి తయారుగమ్మనుము భీషణశాత్రవ శోషణార్ధముల్.

చ. అనిసెలవిచ్చి వారిగుణమంతయు గోచరమయ్యెనింకనీ
పనిపనిలాగు సేయవలె ప్రస్తుతమందున నీవువెళ్ళిమా
కునువనిలేదు నేరమని కుంఫిణివారి దురాయివెట్టి గు
ప్పునవరుదెంచు మిచ్చటికిపొమ్మని యానతియిచ్చెనాత
డున్. 137

చ. అగిచనికుంఫిణీధొరల సామిరుముఖ్యులతోడ బల్కుచు
జ్జనవిభుడాజ్ఞయిచ్చి నిజసైన్యముతో నిటకేగుదెంచగా
వనియిప్పుడేమియున్నయది పైకముజెల్లుచునుండనూరకే
తనువ లడాయికింజనుటజెంతుదుమేయిటమీరలేగినన్ 138

ఆ. సామిరీతునడుపు మార్గమున్నదియొకొ
ప్రాణతోడ మీరుబరవసమున

నేమి హేతువిచటి కేతెంచనదిగాదు
కయ్యమునకు నడచుకరణిగాక 139

క. ఊరక మా తోనీయెడ
పోరాడదలంచి వేలములు వేసితిరీ
నేరంబు మాకు లేదని
భూరమణుడు మీకు దెలుప బుత్తెంచెనన్ 140

క. ఆపలుకులాలకింపుచు
కోపానల శిఖలుముట్టుకొన కన్నులలో
నేపారనిట్లు బల్కిరి
కాపట్యము హృదయమందు కదురేకెత్తన్ 141

సీ. పైకంబు నేడు బేబాకుగా నాలుగు
వాయిదాల్ చెల్లించి వేయవలయు
కొండాలుగున్నన చెన్నపట్టణమున
కేతెంచినపుడు వేయించవలయు
మీకోటలోపల మా కుంపిణీ కాడి
నేడుదప్పక నిల్పనియ్యవలయు
కమిడివచ్చిన దాదిగా నేటివరకును
చెల్లుబాకీయుడి చెప్పవలయు

గీ. నట్లుగాకున్న రేపుఘోరాజిలోన
[illegible]చెదరుగాక మత్యులనూర్చి [illegible]

లిప్పు డేటికి చనుమని చెప్పిరంత
కన్నులను వహ్నికణములు గ్రమ్ముకొనగ 142

క. ఆమాటకు వేంకటపతి
భూమీపతి కనలి రాజపుంగవుమర్జ్జి
యేమాత్రమెరుగ రైతిరె
కోమలమని యిట్టులాడ గొప్పయె మీకున్ 143

గీ. ముజ్జగంబుల నమ్మహాత్మునికి సాటి
యెవ్వరున్నారు, మీరలరిట్లు ప్రల్ల
దములు బల్కిన భయమేమి సమరమునను
జూచెదరు కేసటంబును లేదిచసియె 144

క. చని రాజచంద్రుసన్నిధి
గని మ్రొక్కుచు పలికె దేవ కఠినాత్మకులే
మనువాడ వారిమాటలు
వినవొల్లక వచ్చినాడ వేగంబిటకున్ 145

క. హుంకార మేమిచెప్పుదు
శంకింపరు సమరమునకు జంకరు మనకున్
పొంకముగాదిక కార్యము
కొంకక దామత్తుజూపి కొట్టక వారున్ 146

శా. ఏ రేయోపవలో మహాకుపితులై యిచ్చోటికే తెంచి దు
ర్వారంబైన రణంబుచేసి మనలన్ వంచింప గానెంచియు

శ్రీవిజయరామ మహారాజ దేవేంద్రుండు పేరోలగంబు
నం గొలువుగూర్చుండి కుంపిణీవారి మహోపాయంబు
నకుఁ బ్రతిహతంబు విచారింపుచు సమస్త సేనా నాయ
కులం గనుంగొని మీరలు నిజసైన్యంబులతోడ గూడుకొ
ని నలుదెసల జాగ్రతగా నుండుండని నియోగించి సింహ
ధ్వజంబగ్రభాగంబుననుండ నిశ్చయించి జానుమందివ్యాం
బరాభరణాలంకృతుం డగుచు గోలక్షవృత్త్యంబుల నిర్వ
ర్తించి యష్టోత్తరశత దివ్యక్షేత్రమహాప్రసాదస్వీకారంబు
సేయుచు సమస్త బాంధవ సహితంబుగా షడ్రసోపేతా
న్నంబు భుజించి హంసతూలికా తల్పంబున యోగని
ద్రాసమేతుండై యున్నసమయంబున 155

ఉ. ఆయపరాత్రిక్రృత్రిమ సహాయులు జాతాలవారు మద్యపా
నాయత మత్తులై కనలి నాకరునొక్కెడ గూడియిప్పుడే
యీయుపనీతలేండ్రిసి జయింపగ నొంటరికుట్ర గట్టి సే
నాయకుత్తము కడంకను రణంబొనరింప దలంచిరందరున్

గీ. కాలుకిందిచీమ గదలకుండంగను
యుటకపోసినట్లు వినుకు లేక
యర్ధరాత్రినడచి రటకు పటాలముల్
పుడమియీనినట్లు పోల్కొవీరా 157

మ. అటకాపుంచిన వీరనాయక సమూహంబుల్ పటాలంబుల
చ్చుటికిన్ వచ్చినజాడయుం దెలిసి ముస్తాబై ఘనాయించినా

గీ. దరికిజనుదెంచి యామహీశ్వరునిగాంచి
నిదురచేనుండె నెట్లుదెల్పుదుమొ యంచు
నాడుగుచును మెల్లమెల్లనె యొబుసుపెట్టి
యభినుతించిరి మెల్లన యవనివిభుని 172

చ. తరణికులాబ్ధిసోమవిభు ధన్యనామకిరీట ధామభా
సర్కశశి వంశజాత నృపజాతలలామ సురూపకామ వం
గర కఠనారిరాజ భుజగర్వవిరామ సితాన్యకోటి దు
ర్భర బలభీమ శ్రీవిజయరామ కళింగధరాతలాధిపా

ఉ. చిత్తముకిన్నపంచబోశటి సేయగవచ్చితి మీనిశీధమం
దెత్తుకవచ్చినారు సమరేచ్ఛను జాతులవారు మీరుమా
కిత్తరి నాజ్ఞయిచ్చిన యనేకవిధంబులపోరి వారి చే
తెత్తగ జేతుమంచును నరేశ్వరయంచు వచించు వేళలన్

గీ. నిదురబోవుచు నామేటినృపవరుండు
కలయొకటి గాంచెకలలోన కమలజాండ
పంక్తిగర్భంబులో నున్నపరమపురుషు
నాదిలక్ష్మీసనాథు లోకైకనాథు 175

సీ. కాంచనచేలునకర్తం చరహాతశీలు
మదనకోటి విలాసు మందహాసు
శంఖచక్రధురీణు సకలలోకత్రాణు
పాలలోచనమిత్రు పద్మనేత్రు

నీలమేఘశ్యాము నిగమాంతధాముఁ ల
శ్రీ విరాజిత వక్షుఁ గిరీటధరుఁ
తిరుమణిశ్రీచూర్ణధరు పాదహారు వన
మాలికాలంకృతు మానినీయుతు
గీ. పద్మనాభు జగన్నాథు పరమపురుషు
జూచి పులకాంకురంబుల నచ్చుపడ మేన
సద్భుతంబంది దేవమహాత్మ మీర
లేమివచ్చితిరని యాతఁ డిట్టులనియె 176
ఉ. ఘోరకలిప్రవేశమిది కూడదు నీవు మదంశ సంభవ
త్స్నరమణుండ విడక నిజసైన్యముతోడ లడాయి జేసి హాం
వీరుడితండు నాజను టు విష్ణుపురాణము దివ్యదేహ వి
స్తార సమస్తసంపదలుదాల్చి శాశ్వతమందు నుండగా 177
గీ. మర్త్యదేహంబువలన సామ్రాజ్యమింక
గలిగిన శాశ్వతంబని తెలియుమింక
దివ్యదేహంబుదాల్చి సందియము లేక
పరమవైష్ణవ సాయుజ్యపథముగనుము 178
మ. శతకోట్యర్కసమానమై యఖిల తేజస్సాంద్ర దేదీప్యభా
సితమై చూచినిలింపగుంపులు నుతుల్ సేయంగ శుద్ధాహా
వర్జితమై కప్పుదు దివ్యదేహ మెపుడుర్ జెల్వొప్పగా దా
ల్చి శాశ్వత సాయూత్యపదంబు గాంచుమిల రాజ్యభ్రాం
తి నీకేటికిన్ 179

క. కనుగొని మీరీనిశయం
దున నేటికివచ్చి నారుదుర్లభమాగునే
పనియున్నదో దెల్పుండని
జననాయకు డానతీయ సవినయ మతులై 183

ఉ. ఏమనివిన్నవింతు ధరణీంద్రసురేంద్ర సితాస్యకోటులీ
భూమితలంబు జుట్టుకొని పోరొనరింపగ సాగివారి వే
లాముల జుట్టినారని తలారులు జెప్పిన తల్లిపౌజు మా
కేమిక జబ్బు సేయ సెలవిమ్మని వచ్చిరి యోధులందరున్ 184

క. జనుదెంచిరఖిల యోధులు
జననాయకునాజ్ఞ బడసి సంగ్రామము సే
యనుచిత్తమేమి సెలవని
వినిపించిన బలికె రాజు వీరుండలుకన్ 185

శా. అన్నా యెన్నడు రేయివేళ కపటన్యాత్రివారవారీణులై
యీ న్నారాకలతించి జాతిదొరలో హాహా బలిష్టంబుగా
సన్నాహంబొనరింపు డిందాక నిమేషంబుచే ను విక్షింతునా
పన్నత్రాణుడు రంగడేకలడు మా భారంబు తాబూనగన్.

సీ. అనుచు కర్ణకఠోరంబులై నసలుకు
లామహీజాని సెలవిచ్చి యాగ్రహించి
సకలసేనలు వేగముస్త్రాబుగాగ
నెంచిపడవాండ్రబంచి చాటించుమనుచు.

చ. సెలవిడి దంతధావనము జేసి నిరంతర లోకపావనిం
జలరుహనేత్రపాదజల జాతసముద్భవ భీష్మమాతృకన్
కలితసిత ప్రభన్ త్రిపథగన్ విమలోత్తర దివ్యవాహినిన్
చెలువగు దాల్పువేల్పు తలజెన్నలరారెడి జాహ్నవీనదిన్

క. గంగను సమస్త పాప వి
భంగను కామప్రదానశక్తిని దేను
ప్పొంగెడి దానిని నానృప
పుంగవుడవ్వేళ స్నానముం జేసిరహిన్ 189

గీ. చెలువు మీరంగ మోక్షలక్ష్మీకరగ్రి
హణపవనముమంగళ స్నానమనగనొప్పు
విమలగంగోదకస్నాన మమరజేసె
విజయరామనృపరాజ వీరమౌళి 190

శా. గంగాస్నానము జేసి రాజమణి లోకత్రాణపారీణుడై
బంగారంపు జరీబుటే తళుకు మేల్పట్టంబరంబూని సా
రంగాంకాననమందు బొట్టిడి మణివ్రాతంబు భూషాతతుల్
శృంగారించి శరీరమెల్ల జయలక్ష్మిన్ బెండ్లియాడన్ రహిన్

క. మరియును కిరీటకుండల
ధరుడై పరజీవపవన దర్వీకరమా
కరబాలమూని శ్రీహరి
చరణాబ్జములాత్మదలచి జనపతియంతన్ 19:

క. తిరుమల పెద్దింటికులాం
బురుహా నభోమణిపదాబ్జములఁ దలఁచి మహీ
సురలన్ స్మరించి ధరణీ
వరసింహము విజయరాము వర్ణ్యుఁడు మఱియున్ 193

క. జననీజనకుల మదిలో
ననదలఁచి నితాంతభక్తి నతిఁజేసి జగ
జ్జనకల్ప భూరుహంబా
జన పాలకలోక పూర్ణచంద్రుం దెలిమిన్ 194

వ. తదనంతరంబ హారకేయూర కిరీట కవచకుండలాలంకృతుండును, రక్తమాల్యాంబరాభరణుండును, రక్తగంధానులేపనుండును, బాణబాణాసన హస్తాంభోజ యుగళుండును, కరవాలఖేటక ధురంధరుండును, తిరుమణిశ్రీచూర్ణచిత్రకవిరాజ మానమానిత లలాటస్థలుండును, నిరంతరాష్టోత్తర శతదివ్యక్షేత్ర మహాప్రసాద స్వీకరుండును సతత గంగాగోదావరీ సేతుతీర్థస్నాన పానానేకజన్మ సంప్రాప్త కలుష పంకిలుండును, శ్రీమత్తిరుమల పెద్దింటిసంపత్కుమార వేంకటాచార్య దేశికోపదిష్ట నారాయణాష్టాక్షరీమంత్ర పారాయణుండును, శ్రీమత్కళింగ దేశాధీశ్వరుండును, శ్రీరామభద్ర మహారాజ నందనాగ్రసరుండును, నగు శ్రీవిజయరామ మహారాజ దేవేంద్రుండు పూర్వ భూమీధర శిఖరసంప్రాప్తుండగు బాలసూర్యబింబో

క. అత్తరి జాతులవారలు
తత్తరపడి పోరొనర్ప ధరణీనాథుం
డెత్తుకొని వచ్చెమనపై
నిత్తరినిక జాగుసేయ కేటికటంచున్ 196

సీ. తమజాతిభావల ధారుణీచక్రంబు
గంపింప నందరు గుంపుగూడి
లయనుదిద్దుచు పటాలంబుబురికొల్పి
మోగ్రలశతఘ్ని కాజాలమంత
నిడిగెలంతులసంగ రేచ్ఛగల్గిన నాఘ్న
రులనిశ్చయించి విరుదుహేలు
దాదులకుంపిణీల్ ట్టంబుగా బెట్టి
యాందోళికాపూర్వహా మవ్వగట్టి
గీ. తంబురాల్ దాల్చిధణధణ ధ్వానమొదవ
చేసిరిరువాగు కూకలు చెవుడుపడగ
కృతయుగనిశాట దేవతాపితతిఘోర
సంగరమొనర్చు కాలంబుఛాయదోంప 198

ఉ. అయ్యెడ సూర్యవంశకలశాంబుధి పూర్ణనిశాధినాథుడున్
గయ్యముసేయగా శితముఖ వ్రజముం గనుగొంచుమార్గ
మున్, జయ్యనజూపి వహ్నికణజాలము చూపులదోపన
ప్పుడన్, నెయ్యమెలర్పబల్కె ధరణీతలనాథుల యూథ
నాథులన్ 199

వినుఁడు మా సఖులకు జయించుటాదిగా
శతవత్సరములకు మితముగలదు
పదియేఁడులకును తొంబది యేడులకునైన
మృతినిశ్చయము మేనుసతముగాదు
యెవరిపురాకృతం బేరీతినుండునో
పరికింప నస్సగోచరము కాదు
కావునపుణ్యసంగ్రహము గావించి త
త్కులధర్మమున నున్న గొప్పగలదు
గీ. ఖడ్గధరులకు కఠినసంగ్రామమునను
తొలగిపోవక పోరాడి గెలిచెనేని
ధరణినత్యంతసుఖము మదినప్పనేని
స్వర్గభోగంబుగలదు నిస్సంశయంబు 200

అంతటి యుపదేశము ధరాధిప సింహము సర్వసేనకున్
శాంతముగాఁగ జెప్పి పరసైన్యము గన్గొని చేయివీఁచి యీ
వింతగ్రహించినారె యిట వీరలు గెల్వఁగ వచ్చినారు వీ
రింతకు మించి యజ్జగన నేటికి శీఘ్రము లెండు లెండికన్ 201

తురకసవారుల తురగపాదపరాగ
మఖిలభూమండలం బాక్రమింప
చెలగిపటాలముల్ చెకుమకీబారుల
మెరుపుదిక్కులు మిరుమిట్లుగొలుప

వీరభటావళుల్ ఘోరసింహాధ్వనుల్
దిగ్గజంబుల చెవుల్ దిబ్బటిలపరప
సకలసద్ధాతువులు చరణఘట్టనముల
భోగీంద్రు మస్తకంబులు చలింప

గీ. సౌక్యదమ్మున పటిలతు బుక్కుమీరి
ధరణినాథుని సన్నిధి తెరిబిశోక
మోహరించ సిపాయిస్వ సమూహములను
గెలువ నూహించి రప్పుడు దేకిభవించి 203

శా. చక్రవ్యూహముగట్టి రాన్నృపమహీచక్రంబు విశ్వంభరా
చక్రంబెల్ల చలింప శుభ్రముఖాంతుల్ జూచి భీతిల్లగా
సక్రోధంబున నాసికీధమున వేసంగ్రామముం జేయగా
శుక్రోదంచిత వాహనాళఘటికాస్త్రోత్సంబులంబూనుచున్

క. ఇప్పగిది నుభయబలములు
మిప్పిరిగొను తామసముల మెండొనడి రాయిల్
గుప్పున కొట్టుచు నొండొరు
నొప్పింతుమటంచు నుస్సునుర్వీపతియున్ 204

ఉ. కూడదు కుంపిణీమొనను గుండెగిరించిన సౌక్యపెట్టుమీ
పేడిమిజూపి తద్బలము వెల్వలబారగ ఘోరయుద్ధ
మున్ జేడొనరించు దండుగలవారము వారలయందు జెం
దము! తోడనెన్నొ సంగతులు తొల్లిదొరల్ జరిగించి
రంతయున్ 205

క. త్వరపడకుడనుచు ధరణీ
శ్వరుడానతియిచ్చునంత జాతిపటాలం
బరుదెంచి నిలిచె తంబురు
మొరయింపుచు లయనుదీర్చి ముంగలనంతన్ 206

గీ. కాంచిమరియూరకుండుట కానిమాట
గుండుమోమానుగావచ్చె కుంపిణీలు
తొలిఫయరువారుచేసిన గెలువమనుచు
నూహసేయుచు జాగ్రత్తనున్నయంత 207

క. కడకడ కొన్ని తుపాకులు
పెడపెడమనిపేల కోణగెపిరుదపటాలం
బుసుగకఫయరులు జేసిరి
పిడుగులతోఁగూడు రాళ్ళవృష్టియనంగన్ 208

చ. పురికొని రెండుసైన్యములు భూమినఖంబద్రువన్ శతఘ్ను
లో। తృరఘటికావితానములు తాళఫలంబుల వోలిమూ
కలన్। దురుమగపేల్చుచొచ్చిరి యనూనపరాక్రముతో క
ళానులం। దరుదుసురల్గనుంగొని మహాద్భుతమంచును
ముచ్చటింపగా 209

మ. శరసంఘంబులు లోహనాళఘుటికాచక్రంబులున్ భీమదు
ర్భరకీలానలధూమ బాణములుభూభారంబు వారింపనీ
శ్వరసంకల్పిత మాయరాయన సమిత్ క్ష్మామండలింగప్పె
రయం। క్రూరదానా నిరువాఁగుసైన్యములతో ఖండించెనే
నూటికిన్ 210

క. లయములు దీర్చుచునప్పుడు
ఫయరులు సేయుచును నుభయబలములు గదిమిం
జయముమదిలోన కౌంతేయు
నియామించి కఠోర సమరనిపుణతఁజూపెన్ 211

మహాస్రగ్ధరా:-

ధరణీచక్రంబుఁ గోగెన్ దళదిళలడరెన్ తారకల్ పెక్కురా
లెన్। శరధుల్ ఘూర్ణిల్లుచుండెన్ శశిరుచితగ్గెన్ జాతరూ
పాద్రి మ్రొగ్గెన్। తిరిగెన్ బ్రహ్మాండ పంక్తుల్ దినమణిశశా
కెన్ దిగ్గజశ్రేణిజంకెన్। ధరణీనాథుల్ సిత్రాన్యుల్ దరుమ
భూమిగులన్ దట్టమైపోరుచుండన్ 212

సీ. తారాపథంబు బ్రద్దలుగా శతఘ్నుల
ఘటికాసరంపరల గురియువారు
అవనీతలంబు పెల్లడల పలిదాకు
చేనేసి ఫయరులు సేయువారు
జలరాసిమిగుల ఘోషను జెందవేన చేల
కరకుటమ్ముల హాన గురియువారు
దిశలు బిట్టవియంగ దీడ్రించుచును ధూమ
బాణశతంబులు బరపువారు

గీ. ప్రళయకాల పయోదాల పాలవహ్ని
విధముగల దివ్యబాణముల్ వేయువారు
గలిగి వేసిల్లు రక్తసిక్తంబుగాఁగ
సమరభూస్థలి చెంటలచాయమోప 213

గీ. పరిఘముపట్టిన కరవాలఫలకకుంత
శరశరాసన ముద్గర చక్రభిండి
వాలతోమర భీషణ శూల ముసల
హస్తులగుచును బోరాడి రట్టియెడను 214

చ. భయదులకున్ శతంబులు తుపాకుల గుండులు దాకిప్రా
ణసంశయములబొంది వీరవక్షచ్ఛిన్నము శోణిత సిక్తదే
హములై । రయమున సంగరస్థలి ప్రాంగము గ్రమ్మగదీర్ఘని
ద్రికా । ప్రియముగబూను బారుగుల పెండెముకోయన
బ్రాలెన యెల్లెడన్ 215

సీ. ప్రళయకాలమున భూభారంబువారింప
పడునట్టిపేరగ్గి పిడుగులనగ
పెనుగాలిచే తాళవనములలో వ్రాలు
పరిపక్వమగు తాళఫలములనగ
రఘువీర ఘోరశరములచేతను గ్రుంగు
దశకంఠ కంఠిన మస్తకములనగ
త్రిపురామరల హరించువేళల శూలి
కంటజూచెడి వహ్నికణములనగ

గీ. నుభయబలముల వీరుల నురువణింప
నొక్కగా దాను పదిలతులుక్కునింగిలి
నిండిచెండాడుచుండె బ్రహ్మాండమెల్ల
ఘనతరశతఘ్నికా ఘటికావ్రజంబు 216

సరదార్ల పెక్కండ్రిదురుమువారు
తడయకశూల ముద్గరముఖాయుధముల
నధికార్ల కోటులనడచువారు
గీ. తురికశాస్త్ర ఖండఘటికా సమేత శ
తఘ్నికా వ్రజముల తరిమితరిమి
కాల్బలముల ఘోటకముల గజంబుల
కదిమిమీర నేలగలుపువారు 221

చ. ఇటువిరువాగుసైన్యము లనేకవిధంబుల పోరిపోరియుం
జటులమహాగ్ని వహ్నికణజాలము లొల్కెడి ఘుర్ణకాటు
లన్। తటుకున నానగుండులు శతంబులు నొక్కొకదాని
గూరియర్। దిటమున జాతిసైన్యముల ద్రిమ్మర గుప్పిరిరి
వ్వానివ్వనర్ 222

ఉ. అప్పుడుకన్నులందున దవాగ్ని మిణుంగురులొల్కగాదొ
రల్। గుప్పునపోలుదాడులను గూర్చుకొవచ్చికళింగసేనపై
తప్పకనొక్కపెరు బెడిదంబుగ జేసిరి వేలుగూలగా
నిప్పులవాన రాయనుచు నివ్వెరగందుచు జూడనందరుల్.
సీ. మజ్జగంబులు కోపమున దహించెడు వేళ
శివుకంటిమంటల చెలువుమీరి
దశకంఠుపురము దగ్ధము సేయుతరి హను
మంతుని వాలాగ్ని మహిమమీర
జలరాశి హరియించు సమయమందున బడ

బానల కీలలనపహసించి
గహన వ్రజంబుల దహియించునప్పుడు
దానపావకశిఖల్ దప్పరించి
గీ. పరగు జాజ్వల్యమానమై ప్రజ్వరిల్లు
ధూమబాణంబు లయ్యెడ దొడరివేసి
రింగులీజుల పౌజు జేరెత్తునట్లు
విజయరామావనీనాథ వీరసేన 224

చ. బలబల తెల్లవారెనట పక్షిముఖాదులు కీచుకీచుమం
చెలుగిడుచుండె కుక్కుటము లెల్లనుగూసెను రాజజాలివా
రిలచలియింపబోయిన ననేకవిధంబుల భీతిచేగదున్
ప్రళయమాబుట్టెనంచు బహుభంగుల ఘూర్ణిలు దిక్కు
లోయనన్ 225

ఉ. ఉత్తమసత్యసంధుడు మహోన్నత జాతకళింగ భర్తజా
గ్రత్తగలట్టి వాఁడదియె గాక మదన్వయు డీనిశీథమం
దెత్తుకొవచ్చు జాతిధారలెల్లను బెగ్గలపోర చూచునం
చత్తరివచ్చెనాగ కమలాప్తుడు దోచెనుతూర్పు గుబ్బలిన్

క. సూర్యోదయ కాలంబున
ధైర్యంబుననిలిచి సోలుజాదులు దానున్
శౌర్యంబున నరపతిశో
కార్యంబునకతుకుబడిరి యా కర్ణేలులకున్ 227

సీ. అవచ్చుకర్ణేలు నరసి హాసన్ బేగ
శరవేగమునవటు కరుగుదెంచి

భూమీశ్వరునకు సలాముజేసి ఝుకీల
కరవాలమునటు వరలెంకిఁ జిలిచి
తనకుంపిణీల నుద్వేల్లీలముంగల
లయఁనుగావించి దుర్లభశతఘ్ని
కాసహస్రంబు శీఘ్రంబుగా దట్టించి
బాణశతంబులు బారుజేసి

గీ. సోలుదాదుల సేలు కర్ణేలుమీాద
ఫయిరుసేయించె పిడుగుల వర్షమనగ
ఘోరమిజవజవలాడ భూభుజులు వేఁడ
నొక్కఁడమ్మున్న పదివేల నుర్విఁగూల 228

శా. జ్వాలాభీలదవాగ్ని తప్తఘటికాజాలంబులుం, జోఁకియున్
వేలునూరులుసోలుదాదులసి నవ్వేళం బడంజూచియున్
గాలుం గేలిరెయు వర్పుజాలిన భుజాగర్వంబు రెట్టింపక
ళ్లేలల్కంగరవాలమూను కొసటూసీసేనపై నుగ్రతన్ 229

మ. కదిసెన్ బిక్కలి కోపవేగమునను ల్కాపాతముల్ బుట్టగా
కదనక్షోణి చలింపగా హరిణివ్యాఘ్రంబట్లు కర్ణేలుసాం
పుదలిర్పన్ హతశేషసైన్యములతో పోరాడెముస్తాదుతో
గొదలేకుండ మహోగ్రసాహసనబేగన్ శౌర్యసంరా
గునన్ 230

క. ఆరీతి నిరుదెరంగుల
వీరులు కార్చిచ్చు లట్ల వేగ వసిరి దు

రావీరమహాశౌర్యంబులు
సారెకుతాయించుకొనుచు సమరంబునకున్ 231

క. తమతమ పటాలములతో
సమరము గావించిరుభయ సైన్యంబులలో
నమితపఠాణులు గూలగ
కమలభవాండంబు పెక్కుగడగడలాడన్ 232

గీ. సోలుదాడులు మ్లేచ్ఛులు వేలకొలది
గూలమిక్కిలి శిలకులు గొట్టిరప్పుడు
దొరలురాజులు గనుగొని వెరగుపడగ
కారుకొనుచును శిష్టచీకట్లు గ్రమ్మ 233

ఉ. అంతమహోగ్రుడై కమలజాండము బెగ్గిలరాజులెల్ల వి
భ్రాంతియుబొందియు న్విజయరామనరేశ్వరు నాజ్ఞ జెంది
యత్యంత కుతూహలత్వమున నబ్బురపాటున నిబ్బరంబుగా
కుంతములూని శుభ్ర ముఖకోటిజలింప నెదిర్చిరార్చుచున్.

క. కార్చిచ్చులు ఘోరాటవి
నేర్చంజను దెంచు పగిదినిల జలియింపన్
చేర్చి దిశలదుర్వగా బెం
ట్లార్చుచు సమరంబుసేయ నరిగిరి కడిమిన్ 235

ఉ. తక్కినయోధనాథులతి దర్పమొనర్పగ నొక్కదమ్మునన్
దిక్కులుపిక్కటిల్ల జగతీతలమల్లలనాడ వార్థిభుల్

పెక్కుగలంగగా నసురభీషణులై సితవక్త్రసేనపై
గ్రక్కున నేగుదెంచిరధికంబుగ సైన్యము వెంటగొల్వగన్

చ. కరితురగాధిరోహణులు గాల్బలముల్ రథికుల్ ధనుర్ధరుల్
దొరలును మన్యభూపతులు దోర్బలశౌర్యులు వీరులొంట
రుల్। ధరణీపతుల్ సుభాలుసరదారులు నూరులు వేలు ల
క్షలున్। పురికొని యొక్కసమ్మునను పోరొనరించిరి పె
క్కుభంగులన్ 287

క. ఆపెనుపోరు కళింగ
క్ష్మాపాలుడు విజయరాము జనవిభుడు రణో
ద్దీపితుడుజూచి మిక్కిలి
కోపించి బిరాలపూని కోదండంబున్ 288

శా. కోదండంబుధరించి శాత్రవబలక్షోభంబు గావింపగా
మేదిన్యాధిపు డుగ్రబాణములురిత్పెన్ పూర్వకాలంబు
నం। దాదేవవ్రతపార్థులోయనగ నత్యాలీఢ పాదమ్ము
నన్। వేదండాశ్వశతాంగ పత్తి జడియన్ వేమారుఘూర్ణి
ల్లుచున్ 289

లయవిభాతి

పుడమిచలియింప దిశలదర నభమంతయును
గడగడవణంక రవితడబడుచునుల్లదన్

విష్ణుమూర్తి యనంగను విజయరాము
ధారుణీనాథ విక్రమం బారమార 242

మ. అనుచుం బెక్కువిధంబులం డిభజులయ్యాకాశమందుండియు
జననాథాగ్రణి తొల్లిభీష్ములనతోడ సంగ్రామముం జేసెనం
చును పల్మారునుతింపుచున్ సితముఖస్తోమంపు కాసట్య
ముల్ గనుచున్ ఘోరకలిప్రవేశమిదియే కాబోలునంచెం
చుచున్ 243

క. శితముఖులకు భూపతులకు
సతుకువడెన్ ఘోరసమరమహోరాజిన్
చతురులుమిక్కిలి క్షాత్రమ
మతులుగదా జాతివారు మనుజులలోనన్ 244

మత్తకోకిల

కంటిరేయిదివింత శుభ్రముఖ వ్రజంబుభయంపడన్
వెంటగొట్టి మహోగ్రుడై నృపవీరుడర్జునుడేకదా
వింటినంచు దలంచగా శరవృష్టిగప్పినటంచుతే
గంటిమూకలుమింట నప్పుడు గాంచిసన్నుతిసేయగాన్ 245

మ. విలుచక్రాకృతిగాగ సంగరమహావీరుండు భూమీశ్వరుం
డలుకన్ ఘోరశిలీముఖంబుల సితాస్యవ్రాతముల్ భీతిచే
కలగన్నిప్పుడు రోదసీకుహరముం గర్జిల్ల గాకోదరా
చలచందంబున గప్పె ముజ్జగములన్ జూర్ణంబుగావింపగన్

లయగ్రాహి

కొండలువణంకరవి మండలముజంక మహీ
మండలముగ్రుంగ బ్రహ్మాండముల దిగ్వే
దండములు కొంక నాఖండలము ఖామగుల
తండముల మింటనవు డొండొరులుమెచ్చన్
చండతర కాండములు నండిగ కాననుల
కండలుగ సేయ నుద్దండగతి సేయన్
మెండుగమహీపతులు నిండుకొని వెన్వడిన
యుండిరొయుక్కున్నతిని ఖండనము సేయన్ 247

గీ. పలలశోణిత పంకప్రవాహమబ్ధి
సంఘమమ్మగాక ఘటికావ్రజంబు వృష్టి
గురిసిరవ్వేళ మిక్కిలి తెలివిలేక
నరుకెరంగు పటాలముల్ తరిమితరిమి 248

క. పోరాడిరట కళింగ
తన్నరవరుని వీరసేన సాకేతమహో
స్ఫారపుప్రౌఢిమ మిక్కిలి
ధారాళము కాఁగ సోలుదాదులతోడన్ 249

శా. అభ్రభ్రాజితమై జగత్త్రయములన్ వ్యాపింపగా ధూమమ్ము
ముల్ విభ్రాంతిన్ సమరంబుపూని దిశలన్ వీక్షించి ని
శ్శేషులై శుభ్రాస్యుల్ బెగడొంద ఘోరసమరక్షోణిన్
సహస్రంబులౌ రాభ్రాతుల్ సుత బంధుమిత్రయుతమై
వ్రాలెన్ వడిన్ గొట్టగన్. 250

క. గంధేభస్యందనహరి
బంధురవాహన పదాతిపఙ్క్తి సమిద్ధా
త్రిధైర్య ముడిగిఘటికా
సంధానము సేయ వ్రాలజాగిరిమిగులన్ 251

శా. ధాత్రీనాథుని వీరసైన్యములు పోల్గాముల్ మహాభీములై
చిత్రింబై నరణంబుజేసి జయశ్రీకాంతచే నెంతయున్
పాత్రాపాత్రతలేక దేవదనుజవ్రాతంబు చందంబుగా
గాత్రంబుల్ శతరంధ్రసంకలితమై గన్పట్టునత్యుద్ధతిన్ 252

క. గడగడ పుడమి వడంకన్
జడియక యమ్మేటి వీరసైన్యంబు జవం
బుడుగక ఘనరోనరించిరి
జలనిధిఘూర్ణిల్ల నల్లజదలవియంగన్ 253

వ. అట్టియెడం బదాతులు పదాతులును, రథికులు రథికులును, సారథులు సారథులును, తురంగములు తురంగంబులును, దంతావళంబులు దంతావళంబులును, గలియం బెనగ ముసలంబుల మోదువారును, ముద్గరంబులం బాదువారును, శూలంబులం బొడుచువారును, భిండివాలంబుల గ్రుచ్చువారును, చక్రంబులం జెక్కువారును, గదలం జదియనేయువారును, కుంతంబుల నంతింతయునని హింసనొందించువారును, బాణంబులం బ్రాణావశేషులం జేయువారును, లోహనాళంబులం జేమఱపువారును, శతఘ్నికాజా

లంబులం దుడిచిపెట్టువారును, ఘర్మశాత ఘటికాపా
త్రంబుల నగ్గుసేయువారును, దనుదను యంత్రంబులం
బిగులుబడుచు వారును, ధూమబాణంబులం జిందువందు
సేయువారును, వరశువులఖండించు వారును, పట్టిసంబుల ను
క్కుణంబువారును, గలిగి సంగ్రామంబు భీమంబగుట్ల. అం
త తెగిపడిన శిరంబులుగా దివ్యబాణంబులందును సేయు
వారును, కరవాలంబుల దెగనరుకువారును, సూరకత్తులం
గ్రుమ్మువారును, సన్నీలంబాడిచి త్రోయువారును, అంత
తెగిపడిన శిరంబులును, విరిగిపడు కరంబులును, చూర్ణంబు
న చరణంబులును, శకలంబులయిన కంఠంబులును, చూ
ర్ణంబులైన వక్షంబులును, ముక్కలయిన కటిప్రదేశంబు
లును, వ్రయ్యలైన ముఖంబులును, భాగంబులైన జఘ
నంబులును, ప్రోవులయిన ప్రేవులును, ధాత్రింబడు కిరీ
టంబులును పోరలు కుండలంబులును, దొరగిలంబడు కం
ఠాభరణంబులును, చుట్టుకొనపడు కవచంబులును, తూలిప
డు నంగుళ్యాది చరణంబులును, పాకశాసనకులిశధారా
విదళితంబులైన మహీధర శిఖరంబుల నటవునంబడు మ
త్త దంతావళంబులును, యుగప్రళయ కాలంబున నిలం
గూలు విమానంబుల ననువున నొరగు శతాంగంబులును
మొగ్గతిలంబడు తురంగంబులును, చాపపుట్టునంగుములు
పటాలంబులును, మోకాళ్ళంబడు వీరభటులును, నిలువు

న నీరయిపడు యోధులును, సంధి మీదగూలంబడు శూరులును, నగుచు సంగరాంగణంబునం బ్రవహించు రక్తప్రవాహంబు పద్మనాభ సహితంబుగ పద్మనాభపురీవర శిఖరంబునకుం బ్రదక్షిణ పూర్వకంబుగా పారావార సంగమంబయ్యె నందు పడక మకరంబులును, జంఘామకరంబులును, నేత్రమీనంబులును, ముఖ కమలంబులును, శితోష్ణీష రాజహంసంబులును, శిరజాత శైవాలంబులును, నాభికావర్తంబులును, పిచుండదీపంబులును, ప్రకాశింపుచుండ నప్డు పూర్వకాలంబున దేవాసురలయుద్ధంబు నతిక్రమింపుచు, రామరావణుల పెనుకన సగ్గింపుచు కురుపాండవుల కయ్యంబున ధిక్కరింపుచు, నేకార్ణవంబుగా కళింగాధీశ్వర వీరసైన్యంబులును, శుభ్రానన సమూహంబులుం బోరుచుండిరంత 253

చ. ఇటువలె పోరుచుం ధరణీంద్రుడు కన్నులనిండజూచి యక్కట నిజబాంధవుల్ శితముఖపక్షజ భీషణ లోహనాళ విస్ఫుట నిటలాక్ష నేత్రమున జూపడుచుండెనయా జోలు వహ్నిదా! కుటపని మేషమాత్రమున గూలిరి వేలు రణాంగణంబునన్ 254

శా. అక్కట బంధుమిత్ర భటులాప్తులు మంత్రులుమన్యభూపతుల్! మిక్కిలివీరులొంటరులు మిగుల్ భగిమీలు సుతాల్

దివాను శిం। దొక్క మదిం మడంగిరి మహోగ్రసితాఖ్యు
ల తోడపోరి సాం। పెక్కిన స్వర్గసంపద లనేకదినంబుల
జూరపట్టగన్ 255

ఉ. కాలువలయ్యె శోణితము కంపితమయ్యె నభంబుధాత్రి
యున్। వాలికలయ్యె వీరవరవాహిని ఘోరరణంబులోప
లన్। జూలెను దుర్నిమిత్తములు దోచుచునుండెను జాతి
వారలున్। గూలుచునున్న వార్తయును గూడెదువారలరె
వ్వరిందునన్ 256

క. కాకములు రాత్రిగూసెను
ఘూకంబులు పట్టపగలు గూసెనువీరా
నీకంబు గ్రుంగకుండునె
చేకొని ఘోరాజిరాజ సితవస్త్రులకున్ 257

సీ. కాకగృధ్రములులూక ఘూకజంబుకములు
పగలువాపోయెడు బహువిధముల
పలుమారు ధారుణీవలయము గంపించె
నుర్వీధరాంభోధి యుక్తమగుచు
లవణాంబురాశి జలంబుచప్పనయయ్యె
మర్యాదదాటి గ్రామములుముంచె
ధారాధరములేక దశదిశల్ గంపించె
మానక పెనురాళ్ళ వానగురిసె

గీ. తారకల్ గానబడియె మధ్యాహ్నమందు
ఇంద్రచాపంబు పొడమెయి దృశ్యమయ్యె
వీరవాహిని శుభ్రాస్యఘోరసంగ
రాంగణంబునకోటులు దర్గికున్న 258

ఉ. ఇంతియెకాక గొప్పపనులెవ్వియు బుట్టునెనిన్నవిందిరా
కాంతుడుభక్తవత్సలుడు కాంచనచేలుడు దెల్పచెప్పన్నమం
దెంతయు తత్ప్రకారమున నిప్పుడు ఘోరరణంబులోన నా
వంతయువెన్కతగ్గక సితాస్యులు మచ్చులముల్ చెనంగె
దుర్ 259

క. పదువారి లక్ష్యపెట్టరు
ఫిడుగులవలె పేలుచున్న పెద్దఫిరంగుల్
ఢుడుచుకొని పోరుచుండిరి
జడియకనిరువాఁగు వీరసైన్యములహాహా 260

తరల
ఎంతవింతసమస్త రోహిలకీరణంబు భయంబులే
దింతయైనను మర్త్యదేహములెల్ల నొల్లకలేగ చా
వంతి నొక్కడివాని వీటికిడాయనేగిరి మూకలై
నంతసంబుగ పెళ్ళివారలచందమై కనుపట్టగా 261

సీ. కాదలుకట్టి ముస్తాదు చేసిన మత్త
తంతావళారోహ ధరణిపతులు

శౌర్యముబూని యుద్ధరిత శాత్రవకోటి నదల్చికొట్టుడీ
యార్యులుమెచ్చ బాంధవ నరాధిపులార యటంచుపల్కి-
నన్ 270

సీ. పాండ్యకేకయ మత్స్యపాంచాల ధారుణీ
పతులరట్ట దేశపు ప్రాఁజుతోడ
సంగవంగకళింగ బంగాళనేపాల
జననాథచంద్రు లప్పరలతోడ
కాశ్మీరకేరళ కాంభోజ బాహ్లీక
రాజులుసీమ రాష్ట్రంబుతోడ
మహారాష్ట్ర ఘూర్జరమగధ నృపాలురు
సోలుబాదులు కుంఫిణీలతోడ

గీ. కలసిరంత భయంకరాకారు లుగ్రు
మూర్తులగుచును సంగరంబునననేక
యూథనాథుల దెగటార్చి యుర్విగలపి
విజయారమను కళింగ భూభుజునిజేర్ప 271

సీ. భేరీధమామాలు. వీరకాహాళములు
జంబురాలున్ కంచుతంబురాలు
డప్పులున ఛురీలు ఢంకాల్ టకోరాలు
నాబత్తుబాంకాలు నగరుకుండ
లునునగారానుతులును సానాయిల్ రోమ్ము
తప్పెటల్ దుదుములు కాళములును

ఝాంగణుల్ పెనురణ శృంగశాఖాఖులు తా
పామరపాలును శంఖములును

సీ. ఘోరకలుగంగ ఫెల్లునతారకా ఫ
థముచిరిగి పడ్డయట్టి విధమ్ము నోప
నప్పుడీరువాఁగో వీరులు మఱపిరిగొని
పోరదొడఁగిరి సంగరస్ఫురణధీర 272

ఉ. గుండులుగుంపులుం దగిలి ఘోరరణం బొనరింపుమండనా
ఖండల దేవదానవుల కైవడి జాతిపటాలముల్ మహీ
మండలనాథ చంద్రుని సమాజము మార్కొని రొక్క
దమ్మున నొ! చండతరావహమ్మువుడు సల్పిరివీరులు వేలు
గూలఁగ! 273

మ. పొగబాణంబులు చిమ్ముబుడ్డులు ఘటాబుల్ దివ్యబాణం
బులుఁ! బిగదట్టించిన రామలక్ష్మణులఁగా పేరాఫిరంగుల్
వడిఁ! దగమట్టించిన నొక్కదమ్మునను మార్తాండుంగ్రి
రాయించి యు! జ్జగతీ చక్రముగ ప్పెనప్పుడు తలంచంధూ
మ గాఢాంధమై 274

క. ఆ పెనుపొగ గప్పినవడి
నోపక తెలగాలు జోగిరుర్వినాథుల్
భూపాలు నెదుటఁ బ్రాలిరి
కాపట్ల్యులు మున్నుపడిరి గగనము వణకన్ 275

క. అట్టియెడ సోలుదాదులు
ముట్టికొనవచ్చిన కళింగమహీపతి బలముల్
రెట్టించి పొడువఁజొచ్చిరి
కట్టలుకకవాజివీడఁగా బరువంగన్ 279

క. శూరాకుల చందంబున
ఘోరాజిసితాస్త్రకోటి గూలి చనె నడిన్
బేరాముని మారినగర
ద్వారంబున నిసుకరాలుట తెరిపిడకన్ 280

ఉ. ధూమముగప్పె శైలములతో యజమిత్రనికాంతిరేఖ
ముల్। భూమివిరాకుండ నృపపుంగవ శుభ్రముఖాస్త్రసేన
సం। గ్రామములోన నొండొరులుగానక గుండెలుదాంకి
వ్రాల్చెలి। భూమిరుహంబులట్లు పడిపోవదొడంగిరి వేలుల
తులున్ 281

క. కడితులు పదికోటులు
కదనంబున వార్థిరవని గర్జించంగా
చదలవియగ దిశలద్రువగ
మదయుత గంధేభపంక్తి మార్కొ భరిత్రిన్ 282

క. ధూమంబు గప్పినప్పుడు
జీమూతంబనగ రెండు సేనలదీకన్
వేమరుచకుముకి గుండులు
కామోసినయట్లుగురిసె కలకలనంగన్ 283

ఉ. ఆపెనుపోరునందు శరణాగతవత్సలు డాకళింగ భూ
త్రిపశివతమింపగిలి తీవ్రభయంకరవహ్నితప్తసం
దీపితమైనగుండపుడు దివ్యశరీరముసంగ నెంచిల
క్ష్మీపతియొజ్జబంచిన విశేషతమో ఘనమాత్రరాయనన్

మ. ఘనవత్సంబు శతఘ్నికాఘుటికదాకన్ రాజవీరుండుస
జ్జనచింతామణి విప్రకల్పకము సాత్త్వాదీశ్వరాంశోద్భవుం
డని చాలించిమనుష్యదేహ మభిమన్యప్రౌఢి రెట్టించిగొ
బ్బునదాల్చెన్ నవదివ్యదేహము జగంబుల్నాడు గంటిం
చగన్ ౨౮౫

క. నారాయణ గురుమంత్రో
చ్చారణసేయుచును రాజచంద్రుండనిలో
పోరాడి మర్త్యదేహవి
దారితుడై దివ్యదేహధారుండయ్యెన్ ౨౮౬

చ. సరసిజమిత్రసన్నిభము సత్త్వసమేత మనంతకాంతిభా
సురముపిపాసవర్జనము సువ్రతలభ్యము దివ్యదేహము
ర్వరధరియించి శ్రీవిజయరామ మహాప్రభువిష్ణుదేవతా
పురమున కేగుదెంచె నృపపుంగవకోటి సహాయుడై వడిన్

గీ. మర్త్యదేహంబు మానియమ్మనుజవిభుడు
దివ్యదేహధురీణుడై తేజరిల్లె
ఖనివెడలివచ్చి హేమసంఘటితమైన
సానబట్టిన విప్రవజ్రంబనంగ ౨౮౭

శా. లీలామానుషవేష ధారుడయి తాల్మిక్ రామునింబోలి
భూగోళంబేలి సమస్త ధర్మములు పెక్కుల్ జేసి మర్త్యాంగ
మశ్వేళం ఘోరరణంబునన్విడిచి కీర్తిం బూని దివ్యాంగ
మా। శ్రీలక్ష్మీపతిపట్టణంబునకు వేంచేయంగ నూహించ
గా॥ 219

వ. అంతనంత తేజోవిరాజమానంబును, బాలార్కకోటి ప్రభాభాసురంబును, కాంచనపద్మ సంకులంబులును, నవరత్నఖచిత సువర్ణఘంటాపరంపరాలంకృతంబును, శ్రీమన్నారాయణచరణారవిందదాసానుదాసాసేవార్హంబును, శంఖచక్రగదాపద్మ ధారేయాజానుబాహులైన విష్ణుకింకర సమూహ సమాక్రాంతంబును, దండధరభయంకరంబును, దశయోజనోన్నతంబును, శతయోజన విస్తీర్ణంబును, విశ్వకర్మ నిర్మితంబును, నగునొక్క విమానంబు పూర్వకాలంబున రఘువీరపుంగవునకుం బాకశాసనుండు పంపించిన విమానంబుచందంబున నాదినారాయణ ప్రేరితంబుగా నేతెంచి భూలోకంబునకుం గ్రోసుప్రమాణంబున నిలిచి నంగనుగొని యమ్మహారాజ దేవేంద్రుండు దివ్యదేహధురంధరుండై యద్దివ్య విమానంబునకుం బ్రదక్షిణపూర్వకంబుగా సకలరాజమండల నమోయుండగుచు, కైలాసంబున తనూవిలాసనసంపదలు పరిపూర్ణచంద్రచంద్రికల నిరసింపజేయుచుం గొలువుగూర్చున్న మహాదేవునిం

గనుంగొని యత్యంత మందహాసాంచిత సుందరవదనా రవిందుండగుచు నంతంత హేమశైలంబునం గనుపట్టు త్రింశత్కోటి దేవతలంగూడుకొని సురద్రుమచ్ఛాయల నుండు శచీపురంధరులం గనుంగొని మునివగవు నవ్వుచుం దవ్వునం బొడగట్టు సత్యలోకంబున చతుర్వేదంబుల నుల్లసిల్లెడు వానింగూడి వర్తించు సురజ్యేష్ఠుని నిరీక్షించి మెచ్చుచు శ్రీవిష్ణుసాయుజ్యంబునకుం బ్రవేశించి యాచ్చోటషోడశమహారాజులును, అష్టవసువులును, ద్వాదశాళ్వారులును, షట్చక్రవర్తులును, మొదలైన మహాత్ములం గూడుకొని చతుర్దశ భువనంబులం గలవార్తలు నారదుని వలనవిని కుతూహలుండగుచు చిదానంద విగ్రహుండైన యాదిలక్ష్మీనారాయణునకుం బ్రణమిల్లి యిచ్ఛాలాపంబులం బ్రొద్దుపుచ్చుచు గూర్చుండెనంతనిక్కడ 290

గీ. సురనదీ నందనుని బోలి ధరణివిభుడు
మర్త్యదేహంబు మానిన మాటదెలిసి
యిరుదెరంగులవారు సంగరముమాని
యూరకుండిరి శశిలేని తారలనగ

ఉ. భానుడులేని పద్మములభంగి వసంత విభుండులేని య
క్కానన విధంబునం గమలగర్భుడులేని ప్రపంచమట్లుగా
దానవవైరిలేని వరదాసులుపోలె కళింగభూపుణీ
జాని యొకండులేనినిజసైన్యము వెల్వెలబారె బెండియై

చ. వెలవెలఁబోయి యంత నృపవీరుఁడు తేనిలఁడాయిసేయఁగా
దలఁపగ నేలయంచు సరదారులు రాజులు కుట్రకూడి సే
నలమరలించుకొంచు జననాథకుమారుని గొల్వవచ్చిరా
జలనిధిచేరు వాహినుల చాడ్పున నన్నమరాజు పేటకున్

ఉ. అన్నమరాజుపేట జనియచ్చట గాంచిరి నిత్యసత్య సం
పన్నుని పూనపాటి కులపావనునిం గరుణాంబురాశి నా
పన్నశరణ్యునిం గమలబాంధవ కోటిసమాన తేజునిం
గ్రన్నననొప్పు శ్రీవిజయరామ నృపాగ్రణి బాలకాగ్ర
ణిన్ 294

ఉ. శ్రీయువతీలలామము వసింపగ జాలెడు కన్నుదోయితో
తోయజనేత్ర పాదములతో బెనగొన్న మనోంబుజం
బుతో। పాయనివేడ్కతో ప్రజల పాలనచేయ కళింగ
రాజుల। మిన్న యాతునిం గృపాంబునిధి కీర్తి దురంధరు సత్య
సంధు నా। రాయణమూర్తి గాంచిరి సురల్ కమలాప్తుని
జూచు కైవడిన్ 295

చ. కనుగొని యచ్చటం గలుగు కార్యము దెల్పుడు చేసి సేయ
లే। కునికి గ్రహించి యా నృపకులోత్తము డక్కట యెంత
యయ్యెనా। యని తలయూచి మంచిదికనైన ప్ర[illegible]
న మెంచనేల మీరా! మనముల చింతమానుడని మన్ననసే
యుచు నాదరింపుచున్ 296

క. దొరలార రాజులారా
సరసాగ్రణు వీరలార సైన్యములారా
పరమాప్తులార నేనొక
గురిపల్కెద వినుడు సమరకోవిదులారా 297

ఉ. జాతులవారితో మనకు సంగరమబ్బె భయంబటంచు నీ
రీతిని చింతమానుడు సురేంద్రుడు దేవసమూహయుక్తు
డై। యా తెలివోము మూకలకు నడ్డమువచ్చిన రేవుగ
ట్టిగా। భూతలమంతట గొట్టకెటు పోవగనిత్తును నన్నెరుం
గరే 298

క. అనివారల నూరార్చుచు
జననాథ తనూజవృందము సవినయమతితో
నొనరించెనపుడు షోడశ
ఘనదానము లఖిల విప్రగణముల కెల్లన్ 299

సీ. అగ్రహారములు సాలగ్రామములు నిష్క
ములు గోవులందలములు తురంగ
ములు మత్తసామజములు చీనిచీనాంబ
రంబులు పటాంబరములు శుభ్ర
ములు దివ్యరత్నముల్ ముక్తాఫలంబులు
కంఠాభరణములు కటిసువర్ణ
సూత్రముల్ రజతంపుపాత్రలు కుండలం
బులువిల్వారాంకవములును మరియు

గీ. నాదిగాఁగల్గు దానంబులవనిసురల
కపుడుదయచేసి జనకునియందు భక్తి
నాత్మఁగోని ల్చిప క్షీరధాత్మజుండు
దశరథునికిని సేయ విధంబుఁదోఁప 300

మ. .... .... .... .... .... .... ....రాజశ్రేష్ఠ ....
జనభూమీసురకోటికిచ్చిరిపులన్ సాధించనూహించుచున్
దనరెన్నేఘములిచ్చు సూర్యుడన పుత్రిపౌత్రిడిశతుత్రిత
.... .... .... .... .... ....త్వంబెన్నిచూడ స్పృహిఁ 301

శా. శుద్ధస్నానము జేసి యాన్నృపతి తేజోమూర్తియై యుద్ధస
న్నద్ధుండై నిజవీరసైన్యమ.... ....
.... .... ....పరాహారణవాక్ప్రౌత్రిడిగావించుచుఁ
వృద్ధామాత్యసమేతుడై కొలువుగావించెఁ మహోగ్రా
కృతిఁ 302

వ. తదనంతరక.... .... ....రెందుత్రినకు దేవర్షిపుంగవుం డిట్ల
నియె. 303

మ. పరభూనాథ మృగావళీహరణ శుంభద్భీమ శార్దూలబం
ధురశుభ్రా.... .... .... .... .... .... .... .... .... ....!
లరమానాథ పదారవింద భజనాలావిత్య సంశీలభా
స్వరవంశాబ్ధి నిశానృపాలక కళింగశ్రీ నృపాపాలకా 304



# ఆంధ్రక్షత్రియ గ్రంథపరిశోధకమండలి

## రాజమహేంద్రి

సభ్యులు.

(1) ఆంధ్రభారతీ తీర్థోపాధ్యాయ కవిభూషణ, కవి
శ్రీవత్సవాయి వెంకట నీలాద్రిరాజుగారు, తుని

(2) శ్రీమీర్జానగరరాజా అమృతరామరాజుగారు, తుని.

(3) శ్రీవత్సవాయి రాజా జగపతివర్మగారు, ప్రకాశకులు,
రాజమండ్రి

(4) శ్రీపూసపాటి బుచ్చిసీతారామమూర్తిగారు,
[illegible]

(5) శ్రీరుద్రరాజు వెంకట్రామరాజుగారు, మలికిపురం

(6) శ్రీబుర్రా శేషగిరిరావుగారు యం. యె. పి. హెచ్. డి.
విజయనగరం

(7) పండిత శ్రీపెనుమెత్స సత్యనారాయణరాజుగారు,
తణుకు.

(8) శ్రీరుద్రరాజు నరసింహరాజుగారు, పోడూరు